వ. ఈ ముద్దులబిడ్డం డెవ్వం డింనుండ గతంబేమి? కను వింతయయ్యెడింగ దే
యని తలంచుచు నెప్పగప్పని కంటికోపుంజూపుఁ బూసనల మీాసరంబులం
గై సేయుచు, 38

సీ. ఊర్పులం బొక్కిలి ♦ యొడపి ముత్తెములుఁ జ
కృఁదనాల చిఱుబొజ్జ ♦ కదలుచుండ
సంకుపు లెంకగా ♦ సంకించు కత్తుక
కలికిబుగ్గలు ముద్దు ♦ గులుకుచుండఁ
బొండమ్మిఁ గొన్నన ♦ పొట్ట కెంజాయ న
వ్వేడి కంటిఁ గేవలుఁ ♦ వెలుఁగుచుండ
నపఁదను గరఁగించు ♦ బుసుతనవ్వుల చూడ్కి
కూటువఁ బెరిమంబు ♦ కరియుచుండ

తే. చెలువలరు కేలుదోయి వ్రే ♦ ళులను బట్టి
యెత్తి యడుగుఁదామర నోట ♦ నిడి యొయార
ముగను జీకుచు సంతసం ♦ బుగఁ బరున్న
చిన్నిపాపను గాంచి య ♦ చ్చెరువు నెంది. 39

ఉ. ముంగలిముత్తెముం గలికి ♦ ముక్కును జెక్కులచొక్కటమ్ము క
న్నుంగవజోక చూడ్కి పద ♦ నం జిగిమోవిపసందు నల్లనౌ
ముంగురులు న్మొగంబుపస ♦ బొజ్జబెడంగును గానుఁదీఁగసొం
పుం గయినిగ్గు మూఁపు కొన ♦ బుంగని గంతులువేయుచాడుచుః. 40

వ. వీక్షణమాత్రంబున విస్మృతాశ్రుపూర్ణనేత్రుండును విస్తృతరోమాంచ
గాత్రుండును పీతపరిశ్రమసమాజుండును వికసితహృదయసీరేజుండును
వివిధాద్భుతభావాకృష్టుండును విస్మయాధీనచేష్టుండును నగుచు నవ్విప్రో
త్తముండు ప్రష్టుమనసుండై మెల్లమెల్లఁగాఁ జెంగటి కరుగఁ దోడన
యబ్బాలుం నూర్పుగాడ్పులకుం జిక్కి తద్వేగంబు నిలువరించుకొనసేరక
వానివెంబడిన మశకంబునట్లు తన్నాసికారంధ్రమార్గంబున గర్భకోశంబుం
జొచ్చి యచ్చటను దొల్లింటివలె నిఖిలవిశ్వము నాశ్చర్యంబునం జూడ
సాఁగె 41

చం. తరణి నభంబుఁ జంద్రమసుఁ ♦ దారల దిక్కుల ద్వీప వర్గ సా
గరముల భూమి నద్రులను ♦ గ్రామములం గనులన్ వ్రజంబులన్
బురములఁ గానవంబులను ♦ బుణ్యనదీ నద దేశసీమలన్
సురలను దైత్యులం దపసి ♦ చూచె సమస్తము వేయునేటికిన్. 42

ఆ. వివిధవర్ణజనులు ♦ వివిధాశ్రమముల వ
ర్తించుచుండఁ జూచెఁ ♦ బంచభూత
ములును వానికార్య ♦ ములును జంతువులును
స్వేదజాండజములు ♦ వెలయఁ జూచె. 43

కం. దినముల రాత్రుల మాసము
లను ఋతువుల హాయనంబు ♦ లను యుగముల నం
దొనరు సకలకల్పంబులఁ
గన నీగతిఁ బ్రాతిభాసి ♦ కంబు జగంబుల్. 44

కం. హిమవత్కంధరముఁ దత్పా
ర్శ్వమునఁ బవిత్రమగు పుష్ప ♦ భద్రాతటినీ
కమనీయ కూలమున స్వా
శ్రమమును గను చబ్బురమున ♦ సంయమియుండన్. 45

వ. అంతలో మరల నబ్బాలు నుచ్ఛ్వాసవాయు వ్యూహవేగోద్ధతికిం జిక్కి యొగడాకుంబోలెఁ గుక్షియందు సుడితిరుగుచు నాసికారంధ్రంబునుండి వెలికివచ్చుచు మరల నిశ్వాసంబులవలన లోనికేగుచు నిట్లు సప్తవారంబు లుదరంబుం జొచ్చి యథాప్రకారంబు జగంబులంజూచి కడసారి వెలికి వచ్చినపుడు తల్లయాబ్ధింబడి తన్మహోర్మిజాలంబుల నత్యంతప్రయాసంబున నీఁదులాడుచు నొడ్డుసేరి మెరకపై మొలచిన మఱ్ఱియాకుపైఁ బరున్న బాలుం గని తత్ప్రేమ సుధాస్మితాపాంగ వీక్షణంబు వడసి యతండు స్వీయ హృదయాధిష్ఠితుండగు భగవంతుండ యని యతిసంహృష్టహృదయుం డగుచుఁ గన్నులంగవఁ జిన్నిపావని సోఁకుగంబు జుట్టుకొనుచుం దనివిసనక యుల్లనడాసి బిగియారఁ గౌఁగిలించుకొన నుంకించుటయు, 46

కం. అంతట యోగీశుఁడు భగ,వంతుండు గుహాశయుండు ♦ బాలుఁ డనంతుం
డంతర్హితుఁడయ్యె ముని, స్వాంతేప్సి తనీశుచేష్ట ♦ యట్లు నశింపన్. 47

వ. బాలుండు మెఱుపువలె నాకస్మికంబుగా నదృశ్యుండగునపుడు తత్తేజమున కోపక తాపసుని కనులు మిఱుమిట్లుగొని మూఁతలుపడియె. అంతం గొంతతడవునకు, 48

తే. విప్రుఁడల్లన కన్నులు ♦ విచ్చిచూడ, స్వాశ్రమంబున నెప్పటి ♦ యట్లయుండెఁ
వాల్లితోఁచిన ప్రళయపా ♦ థోధిలేదు, మొట్టనేలఁబుట్టిన మఱ్ఱి ♦ చెట్టులేదు.

ఉ. అంతట మాని కాననము ♦ నారయు, నింగినిఁ బాఱఁ జూచు మే
నంతస్పృశించు వల్కలము ♦ నంటు ధరిత్రినిగాంచు లేచి యా

శాంతము నిక్కఁ జూచుఁ దన ♦ యాశ్రమమంతయుఁ ద్రిమ్మరన్ మనో
భ్రాంతియొ? నిక్కమో! కలయొ! ♦ వైష్ణవమాయయొ యంచు నెంచుచున్

కం. బాలుఁడు నారాయణుఁ డొక, పోలికగా నుండి చేసె ♦ మున్నడిగిన మా
యా లీలం జూపెంగాఁ, బోలు నమోఘభక్తరక్ష! ♦ ఫుల్లాబ్జాక్షా! 51

వ. అని మార్కండేయమహామునీంద్రుండు తలంచుచుండె నని సూతుండు
వెండియు నిట్లనియె. 52

ఆ. అల్పదేశమందు ♦ నధికదేశంబు న,త్యల్పకాలమందు ♦ నధికకాల
మొసఁగఁ జేయునిట్టి ♦ లెన్నో యింతలోన రచ్చ, నీశు మాయ నెఱుఁగ ♦ నెవ్వఁడోపు!

వ. అని సూతుండు వచించె. 54

ఇది మాయాదర్శనమను నవమాధ్యాయము సమాప్తము.

---

## దశమాధ్యాయము

కం. సర్వజ్ఞ! సర్వశక్తి! సర్వేశ్వర! సర్వకర్త! ♦ సర్వాధారా!
సర్వజనీనాగ్రణి! స,ర్వోర్వప్రతిహృదయశోధ! ♦ హరిహరనాథా! 1

వ. [1] దేవా! అవధరింపుము. శ్రీ సూతుండు శౌనకాదిమహామునులతో నిట్ల
నియె. అట్లు మార్కండుండు శ్రీమన్నారాయణవినిర్మిత మాయావైభ
వంబు ననుభవించి మనంబున భయవిస్మయంబులు ముప్పిరిగొన నిట్లనియె.

మ. కమలాక్షా! యసదృక్ష! భక్తజనర ♦ క్షాలోలమా త్వత్పదా
బ్జము మాలంబు సమాశ్రయించితిని గా ♦ పాడంగరావయ్య! జ్ఞా
నము చందానఁ బ్రకాశమానమగుచుం ♦ డ న్నీదుమాయావిలా
సము విద్వాంసులె విభ్రమింతురన నీ ♦ శా! లెక్కయే నేనికన్! 3

మత్తకోకిలము. ఒంటిజందెపువాని కీమహా ♦ దుగ్రవార్నిధివీచికా
కంటకామిత దుఃఖపుంజ వి ♦ కారముల్ గలిగించి యీ
వెంటనేసుమి ఘోరసంసృతి ♦ వెల్గునంచుఁ దలంపుమం
చంటివోగదె! దేవదేవ! ద ♦ యానిధీ! సుగుణావధీ! 4

శా. మాయంబుట్టితి మాయలోఁ బెరిగితిన్ ♦ మాయాప్రభావం బదే
మా! యంచుం దెలియంగనెంచి ననుస ♦ భ్యర్థించితిం, జంకయుం
దేయున్నట్టి యజార్భకంబుఁ బురిఁ బ ♦ ర్యేషించుచందంబునన్
మాయం జేయఁగదయ్య నామజకృషన్ ♦ మాయామనోనాయకా! 5

---

(1) ప్రారంభము 8-1-9147

ఆ. ఎంతచదువుకొన్న ♦ నెంతతపముసేసి, కొన్న నెంతనిష్ఠ ♦ గూరియున్న
నీకృపారసంబు ♦ నెగడదయేని య్యీ, మాయనాటలేము ♦ మాకళత్ర ! 6

వ. అని ప్రసన్నుండై నిమీలితాక్షుండై ధ్యానించుచుండ, 7

### పార్వతీ పరమేశ్వరులు మార్కండునకుఁ బ్రత్యక్షమగుట

సీ. వచ్చియేనికతోలు ♦ దెచ్చి తెల్లనిమెయిం, గట్టి నాఁడొకపుర్ర ♦ పట్టినాడు
కెంజడల్ నెట్టెంబు ♦ గం జుట్టి మిన్నాక, నాఁగినాఁడు విసంబు ♦ ద్రాగినాఁడు
బుడుతచందురురేక ♦ నొడిసి యాఁదలఁ గేవ, నిల్పినాఁ డగ్గిక ♦ న్మల్పినాఁడు
నిద్దంపువిసదారి ♦ మద్దికాయలజోడు, వేసినాఁ డెసబూది ♦ బూసినాఁడు.

తే. ముమ్మొనలవాలు కెంగేలఁ ♦ బూనినాఁడు
రాణికి న్మేనిసాబాలు ♦ వ్రాసినాఁడు
వెల్లనబ్బమాఁవుర నెక్కి ♦ వెడలినాఁడు
విన్నుసిగవేల్పు ! గుబ్బలి ♦ విల్లుదాల్పు. 8

వ. ఇట్లు మహాదేవుండు పార్వతీసహితుండై ప్రమథగణము సేవించుచుండ
గగనంబున విహరించుచు నొకనాఁడు మార్కండేయునాశ్రమ సమీపం
బున నరుగుచో భవాని యమ్మౌనిం జూచి తనజానితో నిట్లనియె. 9

ఉ. చూడుముచూడు మిందొకవి ♦ శుద్ధచరిత్రుఁడు నిశ్చలాంగుఁడై
కూడఁగఁబట్టి యక్షముల ♦ కూటువు డెందము నొక్కివట్టి పె
ల్లాడు మహోర్మి సక్రముల ♦ నాఁచి చలింపనియబ్ధివోలెఁ గొ
ల్లాడఁదొడంగెడిం దపము ♦ నబ్బురమయ్యె మహాత్మ! చూచితే. 10

కం. వాతాపాయాంభోనిధి, భాతి మెలఁగు నితని తపము ♦ పక్వముసేయుం
జూతువుగాక శ్రితజన, త్రాతా ! నీవఖిల సిద్ధి ♦ దాయివి గావే ? 11

చం. అన భగవంతుఁ డీశ్వరుఁ డు ♦ మాంగనఁజూచి హసన్ముఖాబ్జుఁడై
యనియె భవాని ! యీమునికు ♦ లాగ్రణి యచ్యుతగాఢభక్తి పెం
పునఁ దనమానసాబ్జమున ♦ మోక్షము నైతము గోరఁడన్నచో
వనఁబనియేమి ? యింక నిత ♦ రార్థము గోరఁడటంచు మానినీ ! 12

ఆ. అయిన సాధువర్యుఁ ♦ డగు వీనితోడ సం
భాషణంబు సేయు ♦ వాఁడ నివ్వ
డదియు పరమలాభ ♦ మగు మానవులకును
సాధుసంగమంబు ♦ సముచితంబు. 13

వ. అనుచు సాత్వతశరణ్యుండును సర్వవిద్యాగణ్యుండును నిఖిలప్రాణేశ్వరుం
డును నగు మహేశ్వరుం డల్లన మార్కండేయు చెంత కరుగుటయు నమ్ముని

శుద్ధధీవృత్తియగుటం దన్ను విశ్వంబుగ మఱచియున్న సాక్షాత్కరించిన
జగదాత్ములఁ బార్వతీపరమేశ్వరుల నెఱుంగఁడయ్యె. 14

కం. గిరిశుఁడు భగవంతుం డది
యెఱింగి నిజయోగమాయ ♦ ఋషిహృదయగుహాం
తరమునఁ జొరఁబాఱం బ
య్యర వివరమునందుఁ జొచ్చు ♦ నట్లుక్షణమునన్. 15

వ. అక్కారణంబున, 16

తే. వనజమిత్రోదయంబున ♦ భాసమాన
మగు పొడుపుదిక్కువోలె స్వీ ♦ యహృదయాంబ
రమ్ము దేదీప్యమానమై ♦ క్రాల నేమి
చోద్యమంచు లోఁజూపునఁ ♦ జూచుచుండ 17

కం. కంటంబడె నతనికి ము,క్కంటి తటిత్పింగవర్ణ ♦ ఘనజూటుఁడు మే
నంటిన వాల్గంటి గలుగు,దంట పొడలగింటము మొలఁ ♦ దాల్చిన దణియున్

కం. ధనువు శరంబుఁ ద్రిశూలం
బు నసిం జర్మముఁ గపాల ♦ ముం డమరుకమున్
ఘనవరశు వక్షసూత్రం
బునభీతిం బదికరములఁ ♦ బూనినవాఁడున్. 19

ఆ. ఇట్లుతోఁచి శంభుఁ ♦ డెరఁగ నుద్యద్రవి
వోలె నేలయిట్టి ♦ లీలఁ గ్రాలె
ననుచు విస్మితుఁడయి ♦ తన సమాధినిపీడి
కన్నుఁదోయిఁ దెఱచి ♦ కడఁకతోడ 20

కం. రుద్రుని దయాసముద్రుని, భద్రుని భృంగీశ్వరముఖ ♦ పారిషదాత్మా
త్మున్నిద్రునిఁ ద్రిజగద్రక్షో,న్నిద్రునిఁ గని భక్తిమ్రొక్కె ♦ నిజశీర్షముతో. 21

తే. ప్రమథయూతులౌ పురాణదం ♦ పతుల కంత
స్వాగత మ్మాసనమ్ము పా ♦ ద్యమ్ము నర్ఘ్య
మొసఁగి స్రగ్గంధ ధూపదీ ♦ పోపహార
ముఖ సపర్యలసల్పి య ♦ మ్మునివరుండు 22

తే. ఎవనిచేత నీ జగము నిర్వృతమొ? యే మ
హాప్రభావుండు పూర్ణకా ♦ మప్రదీప్తుఁ
డావిభునకు నీకేమిత్తు ♦ నయ్య! కొండ
యంత దేవున కున్నకొం ♦ డంతవత్తి! 23

సీ. కద్రుజటాటవిం ♦ గంగఁదాల్చినవాని, కేనిచ్చు నర్ఘ్యంబు ♦ లించునొక్కొ!
మడికాసుగట్టుపై ♦ నడయాడువానికి, నేనిచ్చుకుశపీఠ ♦ మించునొక్కొ?
ఫణిశిరోమణి విభూ ♦ షణుఁడైనవానికి, నేనిచ్చు నక్షత ♦ లించునొక్కొ!
చంద్రసూర్యాగ్ని లోఁ ♦ చనుఁడగువానికి, నేనిచ్చు దివ్వియ ♦ యించునొక్కొ?

తే. చదలుసిగ దునేదారికి ♦ స్రజ మొసంగి
యష్టభూతియుక్తున కుప ♦ హార మొసఁగి
స్వామి! నామఱకువ బయ ♦ ల్పఱచుకొంటి
శరణు! శరణు! క్షమింపు దో ♦ షముఁ ద్రుంపు. 24

తే. నిర్గుణునకును శివునకు ♦ నిత్యునకును
శాంతునకుఁ బ్రహ్మునకును ♦ సత్యునకు ర
జోజుషునకు ఘోరునకుఁ ద ♦ మోజుషునకు
నీకు మ్రొక్కు చేమోడ్పు వె ♦ న్నెల జోహారు. 25

అశ్వధాటి. భీమా! త్రిపూర్దనుజభీమా! శ్రితాంతరసుభీ మార్జనోద్యమ! సుధా
ధామార్ధశేఖర! త్రిధామా! వచోధికసుధా మాధురీగుణ! శివా
కామా! కుమారజనకా! మాన్యశీల! జితకామా! సురేంద్రవినుతా!
సోమా! సరోజహితసోమాగ్ని నేత్ర! [1] సితసోమా! దయాజలనిధీ! 26

అశ్వ. మింటన్ సిగన్ నుదుటికంటన్ సెగన్ గఱకువింటన్ హరి న్నిలిపి మే
నంట న్వెలంది మలదంటం జెలంగి నెనరుంటం బసల్గులకు క్రే
గంటం జగంబరయుచుంట న్మదిందెలిసికొంటం గడుంబెరిమ ము
క్కంటి న్నినుం దలఁచుచుంటి న్వడి న్మనుపుమంటిం గొనంబులగనీ! 27

కం. అనియీగతిఁ బొగడంగా, విని పరితుష్టుఁడు ప్రసన్న ♦ విమలాత్ముఁడు స
జ్జనగమ్యుఁ డీశ్వరుం డి,ట్లనె లేనగ వాననమున ♦ నడుగిడుచుండన్. 28

ఉ. మెచ్చితి నీప్రవర్తికి న ♦ మేయ తపంబుననిష్ఠ కిప్పు డే
నిచ్చెదఁ గోరుకొమ్ము వర ♦ మెయ్యదియే మదమోహవీక్షచేఁ
దచ్చనలేక మర్త్యుఁ డమృ ♦ తత్వ మహత్త్వము సెందు వేల్పులం
దెచ్చిన మాత్రయంబు వర ♦ దేశ్వరులయ్యె యెఱుంగఁజెప్పితిన్. 29

తే. సాధువుల్ భూతవత్సలుల్ ♦ శాంతమతులు
సంగరహితులై బ్రాహ్మణుల్ ♦ సతము మా త్ర
యమున కేకాంతభక్తులై ♦ యైకమత్య
మార సమదర్శనులు వీత ♦ వైరులగుచు 30

(1) సిత,సా + ఉమా, దేహకాంతౌ తు సా స్త్రియాం, ఉమా స్యాదతసీ గౌరీ హరిద్రా కీర్తి కాంతిషు. (నానా)

తే. ఉండెదరు వారిఁగని ప్రీతి ♦ నొందవి జనులు
లోకపాలురె గాక వా ♦ ణీశశర్వు
లేను శ్రీహరియును నతి ♦ యించి పూజ
సలిపి మఱి యుపాసింతుము ♦ సంయమీంద్ర! 31

ఉ. ఏమిటికిల్లు వారలవ ♦ యిం గలుగు న్నవరంచు నెంతువో
మా మువురందు వారి కిఁక ♦ మాత్రము భేదము గోచరింప ద
య్యా! మఱి స్వాన్యభేద మిసు ♦ మంతయు వారికి లేద, కానె నే
యేమటువంటి మిమ్ము భజి ♦ యించుచునుందుము భూసురాగ్రణీ! 32

ఉ. తోయమయాలు తీర్థవిత ♦ తుల్ మఱిప్రాణవిహీన మృచ్ఛిలా
ప్రాయములైన విగ్రహప ♦ రంపరలుం జిరకాల సేవలం
జేయునుగాక లొక్కక్షణమ ♦ సేయవుపూతము, దృష్టిమాత్రనే
చేయఁగలారు భూమిసుర ♦ శేఖరులా మిము బోంట్లు సంయమీ! 33

మ. అతిస్థావరులై తపంబునను స్వా ♦ ధ్యాయంబునన్ సంయమో
న్నతి నాత్మైకసమాధి సుప్రవిమలా ♦ మ్నాయ స్వరూపంబు స
మ్మతిమైఁ దాల్చుచు నుండునట్టి ద్విజవం ♦ శ శ్రేష్ఠుల న్మానమ
స్కృతు లొక్కుమ్మడిఁ జేయుచుండెడిని జ ♦ మ్మో భూసురగ్రామణీ! 34

తే. అట్టి పూజ్యులో మిముఁగను ♦ లారఁగన్న
విన్న సంత్యాజు లేని పా ♦ పిష్ఠు లేని
పావనతగందు రసఁగ సం ♦ భాషణాది
కముల ఫలమును జెప్పక ♦ క్యమగునయ్య! 35

కం. హరిహరులకుఁ గలదు భిదా,స్ఫురణమ్మని పలుకునట్టి ♦ మూఢాత్ములకుం
బరగవ యిహపరలోకము,లెరియుదు మవ్వారిఁగాంచి ♦ యేనున్ హరియున్

తే. తమవిధిని దాము సేయుచోఁ ♦ దగవుగలదె?
విధినతిక్రమించిన నె వై ♦ విఘ్న మొదవు
కలహములు నరకమ్ములు ♦ గలుగు గ్రుద్ధు
లాడుకొనుట కె? శాస్త్రమ్ము ♦ లవతరించె? 37

తే. స్వప్రయోజనార్థము భేద ♦ సరణి కల్పి
తమ్ము కాపురుషులచే య ♦ థార్థమునకుఁ
బారమార్థికమున లేదు ♦ పాటఁజూచి
మూలమట్టుగఁ ద్రయ్యంత ♦ ముల నెఱుఁగవె? 38

కం. లోకమ్ము భిన్నరుచిగద, యేకైవడి నెవఁడుగోరు ♦ నే మా రూప
స్వీకృతిఁదోఁతుము భక్తానీకమునకు, మందుఁ దెలుఁగ ♦ నేరఁడు దీనిన్. 39

తే. దాసుల యభీష్టములుగొలందిఁ ♦ దద్గుణములు
వానిఁబట్టి క్రియలు వానిఁ ♦ బట్టి హరిహ
రాజనామముల్ దనరెడి ♦ నంతెకాని
నిక్కమునకు లోకేశ్వరుం ♦ డొక్కఁడుగద. 40

కం. అని చంద్రశేఖరుఁడు చె
ప్పిన ధర్మరహస్య సముప ♦ బృంహిత వాగ్గుం
భన పీయూషము శ్రుతిపుటు
లను ద్రావియుఁ దనివినఁ డి ♦ లాసురుఁడెడఁదన్. 41

కం. చిరకాలము హరిమాయా
పరతంత్రుం డగుచుఁ బడిన ♦ బహులాయాసా
విరతక్లేశము వెంటనె
హరవాగమృతమునఁ బాసి ♦ యతఁ డిట్లనియెన్. 42

కం. ఆరరే! భగవచ్చర్యల, శరీరు లెఱుఁగంగలారె? ♦ జగదీశ్వరు లే
త్తెఱఁ మ్రొక్కుదురు ప్రశంసిం, తురు తమకు నియమ్యులనవి ♦ నో యంబుజాక్షా!

శా. స్వామీ! దేహుల ధర్మమార్గము గ్రహిం ♦ పం జేయఁగా నిష్క్రియో
ద్దామల్ మీరలు మర్త్యధర్మముల శ్ర ♦ ద్ధాయుక్తి బోధింత్రు పై
నామోదింతురు ప్రస్తుతిం దొరులుచే ♦ యు న్నిందనష్ఠింత్రు మీ
యీ మాయాక్రియలం బ్రభావ మసదా ♦ నే మీకు? లోకేశ్వరా! 44

ఆ. ఇచ్చవచ్చినట్టు ♦ లెన్నొ మాయాక్రియల్,
సలుపుచుండు నైంద్ర ♦ జాలికుండు
తాముఁగూడ వశ్వ ♦ ధమునఁ జేయుచునుండు,
రీతు తలఁపు లల్ప ♦ లెఱుఁగఁ గలరె? 45

చం. చెలఁగి యవిద్య స్వప్నము స్పృ! ♦ జింపఁగ జీవుఁడొనర్చునంచు న
జ్ఞాలు తలపోయుచందమునఁ ♦ జూ; నిజమాయ సమస్తవిశ్వముం
గలుగఁగఁజేయు నీకు నొడిఁ ♦ గట్టుట యావు సృజించి దానిలో
పల వసియించి యయ్యనుభ ♦ వంబులఁ గందువటే! పరాత్పరా! 46

చం. త్రిగుణముల న్వహించి యవి ♦ త్రిప్పెడు యంతగ నంతెగాని జీ
వుగతి నడంగఁజో, వోకఁడుఁ ♦ బోల్పఁగ నీకుసముండు లేఁడు నీ

వ గుణుఁడ వెల్లవారలకు ♦ బ్రహ్మకు నీవగుమూర్తి కేవల
త్వగరిమఁ గ్రాలుచుండు భగ ♦ వంతుఁడ! నీకివె మత్ప్రణామముల్. 47

ఆ. నీదుదర్శనమున ♦ నే పూర్ణకాముండ, సత్యకాముఁడగును ♦ జనుఁడు భూమ!
అందువలన నీదు ♦ సందర్శనముకన్న, నింక నేవరమ్ము ♦ నిచ్ఛగింతు? 48

కం. ఐనను భగవానుఁడ! నీ, పైనట్టులె పరమభాగ ♦ వతులందుఁ జ్యోతిం
గానని భక్తికలుగ నీ, వే నాకొకవరము శ్రితజ ♦ నేప్సితదాయీ. 49

సీ. అనుచు మార్కండర్షి ♦ ప్రార్థింపఁగా హైమ
వతి యనుమోదింప ♦ భవుఁడు ప్రేమ
మొలుకుచూపుల నిట్లు ♦ పలికె నీకోరిక
సిద్ధించు మఱి ముని ♦ శ్రేష్ఠ! నీక
ధోక్షజుపై భక్తి ♦ యక్షీణమగును నా
కల్పాంతకీర్తియుఁ ♦ గలుగుఁ బుణ్య
మజరామరత్వంబు ♦ నబ్బుఁ ద్రైకాలిక
జ్ఞానంబు బ్రహ్మవ ♦ ర్చసము నొదవు

తే. అమిత వైరాగ్యయుతము జ్ఞా ♦ నమును బడసె
దవు మహాపురాణాచార్య ♦ తయు లభించు
ననివరములిచ్చి మునినుతు ♦ లందికొనుచుఁ
దృప్తుఁడై శివతోడ నం ♦ దివయి నెక్కె. 50

వ. ఇటులాత్ముండు గగనంబున నరుగుచుఁ దనదేవేరికిం దొల్లి యమ్మృకండు
తనయుండు విష్ణుమాయావిభూతి ననుభవించిన ప్రకారమ్ము నుడువుచుం
గైలాసంబునకరిగె నని సూతుండు వెండియు నిట్లనియె. 51

కం. ప్రవిమలభార్గవవంశో, ద్భవుఁ డచ్యుతభక్తిరతుఁ డ ♦ వాప్తమహాయో
గ విభూతిమహిముఁడై యి, చ్చ వచ్చినటు లిప్పటికినిఁ ♦ జరియించుఁ జుమీ.

కం. స్ఫురిత ముకుందప్రకృతి, స్ఫురిత మునివరేణ్య వివిధ ♦ చర్యావిలస
చ్చరితము హృదయానందక, భరితము వింటిరలె విప్ర♦వంశ్యలలాముల్.

వ. మీసందియంబు తీఱినదనితలంతు మహర్షులారా! సప్తకల్ప ప్రళయాత్మకం
బైన భగవన్మాయావైభవంబు మార్కండేయునకొక్కనికిమాత్రమే భగవ
దిచ్ఛచే నాకస్మికంబై యనుభూతంబైనది గాని యది సర్వజనసాధారణ
మైనదిగాదు. మాయాస్వభావము తెలియని కొంద ఱజ్ఞులు దైవయుగ
సహస్రద్వయమానంబున మాటిమాటికి వచ్చుచుండు విశ్వసామాన్యకల్ప
ప్రళయంబులే యవియని భ్రమంబడి పలుకుచుందు రట్లుగాదు. మాయా

శిశు శ్వాసోచ్ఛ్వాసములవలన నేడుపర్యాయములు తదుదర ప్రవేశ
నిర్గమనములవలన సప్తకల్పప్రళయంబులు తత్క్షణమాత్రంబున వాని
కొక్కనికి జరిగినట్లున్నవని విద్వాంసులు భావింతురు. అసలు మాయ
యన సర్గప్రళయాదిలక్షణమగు సంసృతియేసుమీ. మఱియు నింద్రజాలి
కుండే యెన్నియేని యద్భుతంబులం జేయుచుండు నీశ భగవంతుఁ డొక్క
క్షణంబున నెన్ని కల్పంబులం జూపలేఁడు ? 54

కం. ఈ మార్కండుచరిత్రముఁ, బ్రేమము తొలఁకాడ విన్న ♦ వినిపించినఁ గ
ర్మామిత సంసారాంబుధి, నామానవు లుత్తరింతు ♦ రశ్రమభంగిన్. 55

వ. అని శ్రీసూతపౌరాణికుండు పలికెను.

ఇది దశమాధ్యాయము సమాప్తము

---

## ఏకాదశాధ్యాయము

కం. కించిద్జ్ఞనిచేతను వ్రా, యించెదు భాగవతమిట్టి ♦ దే నీమాయా
చంచత్ప్రభావగరిమ ము, దంచల్లోకచయజఠర ! ♦ హరిహరనాథా ! 1

వ. [1] దేవా ! యవధరింపుము. అవ్వేళఁ బురాణశ్రోతలగు మహర్షులలో శౌన
కుండు సూతునితో నిట్లనియె. 2

కం. విమలాత్మ ! భక్తవర్యా ! సమస్త తంత్రార్థతత్త్వ ♦ సారవిదు లుదా
త్త మనీషులైన మిముఁ బ్రశ్న మొకండడిగెద నెడంద ♦ సందియ మెడలన్.

తే. కేవలుఁడగు శ్రీవిష్ణుపూ♦జావసరము,
లందుఁ దాంత్రికు లెట్టిత ♦ త్త్వాళిచేత
నంగముల నుపాంగమ్ముల ♦ నాయుధముల
భూషణమ్ములఁ గల్పింతు ♦ పుణ్యపురుష ! 4

కం. ఇట్టిక్రియానైపుణమున, నెట్టిజనుం డైనఁగాని ♦ యెనయు నమృతతా
పట్టంబుఁ గాన మీరి,వ్వట్టున నిది తెల్ప వేఁడు ♦ వాఁడ మహాత్మా ! 5

—* సూతుండు మహాపురుషపూజాక్రమ మెఱిఁగించుట *—

వ. అనినసూతుండు విష్ణువిభూతులను వేదతంత్రములందుఁ జెప్పిన బ్రహ్మ
ద్యాచార్యులకు నస్మద్గురువర్యులకు నమస్కరించి నుడివెద ననిగురునమ
స్కారం బాచరించి యిట్లనియె. ప్రకృతి సూత్ర మహ దహంకార

---

1. అధ్యాయ ప్రారంభము 14-1-1947

పంచతన్మాత్రమ్ములను తో మిశ్రితతత్త్వములచేతను, నేకాదశేంద్రియ పంచ
మహాభూతమ్ములను షోడశవికారంబులచేతను, విరాట్పురుషుండు నిర్మితుండు
చేతనాధిష్ఠితుండైన వీనియందు భువనత్రయము గోచరించుచున్నది. 6

సీ. బ్రహ్మాండరూప వి ♦ రాట్పురుషునకును
భూమ్యాద్యధ స్సప్త ♦ భువనములును
చరణముల్, దివముశీ ♦ ర్ష; మ్మాకసమునాభి;
రవినేత్రములు; సమీ ♦ రణుఁడునాస;
జానువుల్ దెసలు; ప్ర ♦ జాపతిప్రజననేం,
ద్రియము; మహానంబది ♦ మృత్య్వు; వఖిల
లోకపాలురు బాహు ♦ లుం; జంద్రుఁడు మనంబు;
యముఁడు భ్రూయుగము; దం ♦ తములుజ్యోత్స్న;

తే. ప్రేమయుత్తరోష్ఠంబు, క్రీఁ ♦ బెవవిలోభ
మవనిజములురోమములు; స్మ ♦ యమ్ముభ్రాంతి;
జలధరములు కేశమ్ములై ♦ వెలయు; నిట్టి
యంగము లెసంగు మనకున్న ♦ య ట్లతనికి. 7

తే. అవనిలోఁ బ్రతివ్యక్తి స్వీ ♦ యముగ జేన
నేడు జేనల పొడవుండు ♦ నీక్రమమున
నీవిరాట్టుం దనవితస్తి ♦ నేడు జేన
లుండు నెంత చెట్టుకు గాలి ♦ యుండునంతే. 8

వ. అప్పరమపురుషుం డాత్మజ్యోతిని గౌస్తుభరత్నంబుగను వక్షస్థలంబున వ్యాపించిన తన్మణిప్రభాపటలంబును శ్రీవత్సంబుగను నానాగుణమయం బైన స్వకీయమాయను వనమాలగను వేదంబును బీతవస్త్రంబుగను త్రిమాత్రప్రణవంబును బ్రహ్మసూత్రంబుగను సాంఖ్యయోగంబుల మకర కుండలంబులుగను బ్రహ్మలోకంబు సర్వలోకనమస్కృతంబు గిరీటంబుగను నవ్యాకృతమును దా శయనించియుండు ననంతుండుగను ధర్మజ్ఞానాది యుక్తంబైన సత్త్వగుణంబును నాసనపద్మంబుగను నింద్రియమనో దేహ బలయుతంబగు ప్రాణతత్త్వంబు గదగను నొనర్చికొని ప్రకాశించు చున్నాఁడు. మఱియు నతనికి జలతత్త్వంబు శంఖంబుగను దేజస్తత్త్వంబు సుదర్శనంబుగను నాకాశతత్త్వంబు ఖడ్గంబుగను దనరారుచున్నది. అతని చర్మమ్ము తమోమయమ్ము. శార్ఙ్గకార్ముకమ్ము కాలమయమ్ము తూణీ రమ్ము కర్మమయమ్ము. అయ్యాజాన కింద్రియంబులే శరంబులు క్రియాశక్తి యుక్తమనంబే రథంబు శబ్దాదితన్మాత్రములే రథబహిరభివ్యక్తి ఆ దేవుండు

ధరించిన ముద్రలవలననే యతని పరదానాభయదానాది క్రియా
స్వరూపము సంభావ్యంబగు. 9

తే. అర్కమండలంబె దేవ ♦ యజనభూమి;
ఘనగురూపాత్త మంత్రదీ ♦ క్షయె తదీయ
పూజకర్తృత; యీదేవ ♦ పూజవలన
వృజిననాశమౌ నంచు భా ♦ వింపవలయు. 10

కం. భగవంతుఁడు భగశబ్దో, పగతైశ్వర్యాది షట్క ♦ వనజముఁ గయి లీ
లగఁదాల్చుఁ, జామరవ్యజ, నగతిఁ ధర్మము యశమ్ము ♦ నర్మిలిఁబూనున్.

కం. అకుతోభయ వైకుంఠ, ప్రకటితధామమను నాత ♦ పత్రిముఁదాల్చున్.
సకలామ్నాయ భుజంగాం, తకుపై యజ్ఞపురుషుం డ ♦ తండు చరించున్ 12

ఆ. కేవలాత్మరూపు ♦ నీ విష్ణుదేవు ని, త్యానపాయిని యగు ♦ నట్టి శక్తి
శ్రీస్వరూపమున భ♦జించుచునుండు ను, రమ్మనందుఁ గాఁపు ♦ రమ్మువెట్టి

తే. వరము నతని నాగమతంత్ర ♦ పార్షదాధి
నాయకుండు విష్వక్సేన ♦ నాముఁడు, నణి
మాది కాష్టగుణములు నం ♦ దాదిరూప
మునను దద్ద్వారపాలు రా ♦ చును భజింత్రు. 14

వ. అమ్మహాపురుషుండు స్వయముగా వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ
నామమ్ములఁ జతుర్మూర్తివ్యూహమ్ములఁ బరగి సేవ్యుండగు. 15

సీ. బాహ్యేంద్రియములచే ♦ బహుళార్థము లనుభ
వించు జాగ్రద్దశ ♦ విశ్వుఁడగుచు;
స్వాంతవిషయముగు ♦ స్వాప్నికావస్థలో
భాసిల్లుఁ దైజసా ♦ హ్వాయముపూని;
బహిరంతరింద్రియో ♦ పశమంబుకల్మిఁ ద
దుభయ సంస్కారమ్ము ♦ లొందియూరు
నజ్ఞానమండలి ♦ యల సుషుప్తిస్థితిఁ
బ్రాజ్ఞనాముండనఁ ♦ బరిఢవిల్లు;

ఆ. అమలమైన జ్ఞాన ♦ మలరు ముక్తావస్థ
యందుఁ దాఁ దురీయుఁ ♦ డనఁగ నెగడుఁ;
బరమపురుషుఁ డజుఁడు ♦ భగవానుఁ డిట్లు దే
హముల నత్తెఱఁగుల ♦ నాడఁదలఁచి. 16

వ. ఇట్లు భగవంతుం డీశ్వరుండు పాదాద్యంగంబులచేతను గరుడాద్యుపాంగంబులచేతను సుదర్శనాద్యాయుధంబులచేతను గౌస్తుభాద్యాకల్పంబులచేతను భాసిల్లుచు వాసుదేవాదిచతుర్మూర్తియగుచు విశ్వాదిచతుర్నామంబులొలసి జీవత్వంబునయందు నియంతగా వలయుచు హరి సంతతసేవ్యుం డగుచున్నాఁడు. 17

ఆ. స్వమహిమంబువలనఁ ♦ బరిపూర్ణుఁడై యుండు
బ్రహ్మకారణుఁడయి ♦ పరగుచుండు
స్వప్రకాశుఁడగుచు ♦ సర్వంబెఱుఁగుచుండు
నట్టిబ్రహ్మమునకు ♦ నంజలింతు. 18

తే. స్వీయమాయచేత ♦ విశ్వంబుఁ బుట్టించఁ, దనుపుఁ, ద్రుంచి వేయుఁ ♦ దానె కొండె
బ్రహ్మవిష్ణురుద్ర ♦ పరనామములు దాల్చు, నట్టిబ్రహ్మమునకు ♦ నంజలింతు. 19

ఆ. అనవరత మహాప్ర ♦ త్యక్షుఁడయ్యును విప్ర
తాత్మునట్లు తోఁచు ♦ సన్నిగనుచుఁ
దత్పరులకు నాత్మ ♦ తత్త్వంబుగ లభించు
నట్టిబ్రహ్మమునకు ♦ నంజలింతు. 20

శా. శ్రీకృష్ణా! వ్రజకామినీ ప్రణుతా! ♦ వృష్ణీంద్ర! గోవింద! భూ
లోకా రిక్షితిపాలవంశదహనా ♦ లోకా! ప్రవృత్తప్రథా!
పాకారిప్రణుతా! యనంతవిభవా! ♦ వాచంయమాదిత్యర
త్నాకేళీ! శ్రవణాభిమంగళ! నమం ♦ గాపాదవేమొక్కెదన్. 21

ముక్తపదగ్రస్తసీసము.

నందాదిభక్తహృ ♦ న్మందిరస్థిరవాస! వాసవాద్యమరసే ♦ వ్యపదపద్మ!
పద్మాసతీమనః ♦ పంకేజలోలంబ! లంబమానాలకో ♦ ల్లసితముఖ!
సుముఖోత్తమవచోభి ♦ శోభితేద్ధవతార! తారాచలోదార ♦ ధైర్యసార!
సారసపత్రవి ♦ శాలనేత్రవిరాజ! రాజార్ధశేఖర ♦ ప్రాణమిత్ర!

తే. మిత్రకోటిసమప్రభా ♦ మేయకాయ! కాయజాతీతసౌందర్య ♦ ఘనవిలాస!
లాసతర్పితగోపగో ♦ పీసమాజ! మాజనతఁ బాపి ప్రోవుస ♦ న్మానమునంద 22

చం. నిరతము వేఁగుజామున ని ♦ ద్దుర లేచి వినిర్మలాత్ముఁడై
పరమపవిత్రుఁడై మదిని ♦ బట్టి తదంఘ్రులఁ జేర్చి యిమ్మహా
పురుషుని లక్షణంబు లిటు ♦ బుద్ధి జపించెడివాఁ డెఱింగెడిన్
బరము గుహాశయున్ నిగమ ♦ వందితుఁ బరమాత్ము బ్రహ్మమున్. 23

వ. అనిన శౌనకమహర్షి యిట్లనియె. 24

తే. [1] అర్కమండలంబె దేవ ♦ యజనభూమి
యంటి, మఱితొల్లి యభిమన్యు ♦ నాత్మజునకు
[2] వినిచె సంగ్రహముగ రవి ♦ విషయము భగ
వానుఁడైన శ్రీశుకయోగి ♦ వశ్యుఁడనఘ ! 25

కం. నెలనెలకుఁ బెక్కు తెఱఁగులఁ, గలిగెడి సౌరగణ సప్త ♦ కమ్మందురు వా
రల పతులనామకర్మా,దులఁ దెలుపుమహరియుఁ గాదె♦ద్యుమణిగ వెలుఁగున్ 26

♦ సూతుండు శౌనకాదులకు ద్వాదశాదిత్యవ్యూహము నుడువుట ♦

వ. అన శ్రీసూతుండిట్లనియె. 27

తే. సర్వదేహుల కాత్మఁ డీ ♦ శ్వరుఁడు విష్ణు
వతఁడు లోకయాత్ర జరుగు ♦ నట్టిపనికిఁ
దన యనాద్యవిద్యా మహా ♦ త్వమున సూర్యు
వెలయఁజేసి నాతఁడు లోక ♦ ములఁజరించు. 28

తే. సృష్టికర్త లోకాత్ముండు ♦ శ్రీహరియె వి
కర్తనుఁడు క్రియాభేదంబు ♦ గా నుపాధి
కర్తె; నంతియు భిన్నులు ♦ గారువీరు
"సూర్య ఆత్మా జగత" యంచు ♦ శ్రుతియు లేదె! 29

ఆ. ద్విజవరేణ్య! సర్వ ♦ వేదక్రియలకు నీ
తండ మూలమగు క ♦ తముఁగాదె!
ఋషివతంసు లర్క ♦ నెన్నియో విధములఁ
బొగడుచుందు రెదలు ♦ పొంగువాఱ. 30

కం. సమయమ్ము ఫలము క్రియ కా
ర్యము కరణము కర్త దేశ ♦ మామ్నాయము ద్ర
వ్యము ననునీతొమ్మిదిచం
దముల హరియొకండ వెలుఁగుఁ ♦ దన ప్రకృతిగతిన్. 31

వ. సమయమనఁ బ్రాతరాదికాలము. ఫలమునా స్వర్గాదికము క్రియ
యనంగ ననుష్ఠానము కార్యమన యాగాదికము. కరణమన స్రుగాదిక
మామ్నాయమన మంత్రము ద్రవ్యమన వ్రీహ్యాదికము వీనికిమూలము
సూర్యుండగుట నతనిగూర్చి యెఱుంగవలసియున్నది. 32

తే. కాలరూపుఁడౌ భగవంతుఁ ♦ డోలి బార
నెలలయందు వేర్వేఱు వం ♦ డ్రెండు గణము

(1) 10 వ పద్యమున (2) పంచమస్కంధమున

లలరి సేవింపఁగా లోక ♦ యాత్రజరుగు
పొంటెఁ జరియించుఁ దద్విధం ♦ బును వినుండు. 33

తే. ప్రతిగణంబున మాసాధి ♦ పతి ఋషీశ్వ
రుండు గంధర్వుఁడును నప్స ♦ రోవనితయు
యక్షుఁడును నాగపతియును ♦ రాక్షసుండు
నుండి యా యా నెలలఁ జొప్పు ♦ చుందు రెలమి. 34

సీ. హేతిదైత్యుఁడు రథ ♦ కృన్నామయక్షుండు
తుంబురుగంధర్వుఁ ♦ డుం బులస్త్య
మునియు వాసుకియను ♦ భుజగవర్యుఁడు కృత
స్థలియనునప్సరో ♦ లలన ధాత
యనురవి మధుమాస ♦ మునుగడపుచునుంద్రు;
పుంజికస్థలియను ♦ పువ్వుఁబోఁడి
నారదాఖ్యకగం ♦ ధర్వుఁడు కచ్ఛనీ
రుండు నాగుఁడు పుల ♦ హుండు మౌని

ఆ. రాక్షసుఁడుప్రహేతి ♦ యక్షుండును రథౌజుఁ. డర్యమాభిధుండు సూర్యుఁ
డిట్లు వారలెల్లఁజేరి వైశాఖమాసంబు నడపుచుంద్రు మౌని నాథులార!

సీ. తక్షకోరగుఁడు ర ♦ థస్వనయక్షుండు
పౌరుషేయుండను పలలభోజి
హాహాఖ్యగంధర్వుఁ ♦ డత్రిఋషివరుండు
మేనకాప్సరసయు ♦ మిత్రనామ
సవితయు జ్యేష్ఠమా ♦ సముఁగడపుచునుంద్రు
చిత్రస్వనుఁడు దైత్య ♦ శేఖరుండు
సహజన్యయక్షుఁ డ ♦ చ్చరలేమరంభ హూ
హూనాముగంధర్వుఁ ♦ డురగుఁడుండు

ఆ. శుక్రనామకుండు ♦ చక్రి వసిష్ఠుండు, ఋషియు వరుణుఁడనెడు ♦ నినుఁడు వీర
లందఱెలమిఁగలిసి ♦ యాషాఢమాసంబు, నడపుచుంద్రుమౌనినాథులార!

సీ. చర్యరాక్షసుఁడు వి ♦ శ్వావసుగంధర్వ
వర్యుఁ డేలాపుత్ర ♦ పన్నగుండు
నంగిరోమౌని దే ♦ వాంగనప్రమ్లోచ
శ్రోతృయక్షుండు నిం ♦ ద్రుఁడనుసూర్యుఁ
డిసమాహ్వయము నభో ♦ మాసంబుఁగడపుదు
శంఖపాలుఁడనుభు ♦ జంగపతియు

వ్యాఘ్రదైత్యుఁడు భృగు ♦ వాచంయమశ్రేష్ఠుఁ
డారణాఖ్యాక ♦ యక్షవరుఁడు.

తే. మఱి యనుమ్లోచయను నెడున ♦ చ్చరయు నుగ్ర
సేననామకగంధర్వ ♦ శేఖరుండు
బలసి కొల్వ వివస్వదా ♦ హ్వయుఁడునూర్యుఁ
డడరి భాద్రపదంబును ♦ నడపుచుండు. 37

సీ. కంబలాశ్వుండునా ♦ గవరుండు శతజిత్తు
యక్షుండు జమదగ్ని ♦ యమి తిలోత్త
మాభిదాప్సరస బ్ర ♦ హ్మోపేత దైత్యుండు
ధృతరాష్ట్రగంధర్వుఁ ♦ డతి ముదమునఁ
గొలువ నిషంభరా ♦ ఖ్యుఁడురవి యాశ్వయు
జంబును బ్రేమతో ♦ సాఁకుచుండు;
సత్యజిద్యక్షుఁ డ ♦ శ్వతరాఖ్యభోగి వి
శ్వామిత్రమౌని య ♦ ప్సరసరంభ

తే. ఘనుఁడయిన మఖాపేత రా ♦ క్షసుఁడు సూర్య
వర్చసుండను గంధర్వ ♦ వంశజుండు
సాహ్యమొంద విష్ణువనెడి ♦ సవిత పూని
కార్తికమ్మును బాలించు సా ♦ ఖ్యమ్ముగలుగ. 38

సీ. ఊర్వశీవనిత తా ♦ ర్క్ష్యుండు యక్షుండు వి
ద్యుచ్ఛత్రువను రాక్ష ♦ సోత్తముండు
ఋతసేనగంధర్వుఁ ♦ డతిబలుండగు మహా
శంఖనాగుండు క ♦ శ్యపమహర్షి
కొలువ నంశువనున ♦ ర్యముఁడు మార్గశీర్ష మా
సమ్మును నెమ్మితో ♦ జరుపుచుండుఁ
బూర్వచిత్తియను పూ ♦ వుంబోఁడి కర్కోట
కాహియు నూర్జుఁడన్ ♦ యక్షవరుఁడు

ఆ. స్ఫూర్జుఁడనెడి రాక్ష ♦ సుఁ డరిష్టనేమి గం
ధర్వుఁ [1]డాయువనెడి ♦ తాపసుండు
బలసి కొలుచుచుండ ♦ భగుఁడను సూర్యుండు
పుష్యమాస మెల్లఁ ♦ బ్రోచుచుండు. 39

---

1. "క్రతురేవచ" అని కూర్మ పురాణమునఁ గలదు.

సీ. గౌతమ బ్రహ్మర్షి ♦ వాతరాక్షసుఁడు సు
షేణుఁడన్ గంధర్వ ♦ శేఖరుండు
సురుచి సమాఖ్య య ♦ క్షుండు ఘృతాచ్యప్స
రోంగనయును ధనంజ ♦ యాహ్వయ ఫణి
సేవింపఁ బూషాఖ్య ♦ చిత్రభానుఁడు మాఘ
మాసంబుఁగాచుఁ ద్రే ♦ మమ్ము దోలుక
²సేనజిదప్సరో ♦ మానిని యైరావ
త భుజంగపతి భర ♦ ద్వాజముని

తే. విశ్వగంధర్వుఁడును సుర ♦ ద్వేషి వర్చ
సుండు ³క్రతునామకుండు య ♦ క్షుఁడు భజించు
చుండఁ బర్జన్యనామధే ♦ యుండు సూర్యుఁ
డెలమి ఫాల్గున మాసంబు ♦ నేలుచుండు. 40

కం. ఇవి శ్రీహరియాపుండవు, పవిత్ర. విభూతితతు లుభయ ♦ సంధ్యల నిత్యం
బవిరత భక్తిని వీనిం, దవిలి, తలంచునరు పాప ♦ తతి నాశమగున్.

కం. ద్వాదశమాసంబుల నిటు, లాదిత్యుఁడు షట్సవర్య ♦ లంది తిరుగుచున్
సాదృతి నిహపరశుభ ధీ, చోదనమును సల్పుచుండుఁ ♦ జామి సర్వులకున్

సీ. స్వపరత్రయిన్ ఋషుల్ ♦ సన్నుతుల్ సేయంగ
నచ్చరల్ ముందు నృ ♦ త్యములుసలుప
గంధర్వులు మనోజ్ఞ ♦ గానంబులొనరింప
గ్రామణుల్ రథచోద ♦ కతనుబూన
నాగులు రథబంధ ♦ నమున రజ్జులుగాఁగ
బలశాలులగు దైత్య ♦ వర్యులెలమిఁ
బిఱుఁదిదెస వహించి ♦ యరదంబుఁ ద్రోవంగ
వర్ష్యంపు చరియించు ♦ నంతెకాక

తే. వాలఖిల్యు లర్వదివేల ♦ బ్రహ్మఋషులు
తన కభిముఖంబుగానిల్చి ♦ యనవరతము
శ్రుతిచయంబులతోడ సం ♦ స్తుతులొనర్పఁ
గ్రాలుచుండు శ్రీసూర్యనా ♦ రాయణుండు. 43

---

2. "విశ్వాచి" అని కూర్మపురాణము.

3. 'ఋతుః' అని బొంబై ప్రతి. క్రతుః అని వావిళ్లప్రతి. కూర్మమునను "క్రతుః" అనియే కలదు.

ఆ. ఇట్లనాదినిధనుఁ ♦ డీశుండు శ్రీహరి
కల్పకల్పమం ద ♦ నల్పభంగిఁ
దనకుఁదా విభాగ ♦ మొనరించుకొని లోక
చయముఁ గాచుచుండు ♦ సంతతంబు. 44

వ. అని శ్రీ సూతుండు శౌనకాదులకుం జెప్పె. 45

ఇది పదునొకండవ యధ్యాయము సమాప్తము.

## ద్వాదశాధ్యాయము

కం. కోట్యర్క సమానప్రభ !
త్రుట్యద్గళ సూత్రరిపుప ♦ ధూజన ! నిష్కా
పట్యచరిత ! మునిహృదయ
ప్రాట్యంఘ్రిద్వయ సరోజ ! హరిహరనాథా ! 1

వ. [1] దేవా! యవధరింపుము. అంత శ్రీసూతుఁడు శౌనకాదులతో నిట్లనియె. 2

### —* ఏతత్పురాణోక్త విషయ సంగ్రహము *—

తే. మొదట వెలిడెద మహాధర్మ ♦ మునకు జోత
లిడెద శ్రీకృష్ణునకు విశ్వ ♦ సృష్టికేళి
కంజలింతు బ్రాహ్మణులకు ♦ నవల నుక్త
ధర్మములనె సంగ్రహముగాఁ ♦ దలఁతు మరల. 3

కం. మీరడిగిన కతమున ఋషులారా ! నుడివితిని శ్రుతిశిర♦సాయనమున్ శ్రీ
నారాయణ పుణ్యకథా, సారమ్మున్ వేదవీధి ♦ సంచారమ్మున్. 4

తే. అఖిల పాపహరుండు నా ♦ రాయణుండు
హరి హృషీకేశ్వరుఁడు సాత్వ ♦ తాశ్రయుండు
తామరసనిభ నేత్రుం డి ♦ దంపురాణ
మందు సంకీర్తితుండయ్యె ♦ ననఘులార ! 5

వ. ఇందు సర్వవిశ్వసృష్టిసంహారకారణము నిర్గుణపరబ్రహ్మమును సపరోక్ష విజ్ఞానానుభవపర్యంతము జ్ఞానమ్మును దత్సాధనమ్ము నభివర్ణితములు. మఱియు భక్తియోగముఁ దదాశ్రయమగు వైరాగ్యమును నిరూపితములు.

(1) 26-1-1947 అధ్యాయప్రారంభము

కం. నారదవృత్తాంతంబును, బారీక్షితగాధ శాప ♦ వశత నిరశనుం
డా రాజర్షికి వ్యాసకు, మారున శుకగోష్ఠి యాది ♦ మస్కంధమునన్. 7

తే. యోగమున నర్చిరాదుల ♦ నొందుటయును
ధాతృనారదగోష్ఠి వ ♦ తారవర్ణ
నమ్ము వైరాజపురుష స ♦ ర్గమ్ము నాది
గాఁగఁగలదు ద్వితీయమా ♦ స్కంధమందు. 8

వ. విదురోద్ధవసంవాదము, విదురమైత్రేయసంభాషణము పురాణ సంహితా ప్రశ్నంబును ప్రళయంబున మహాపురుషసంస్థితియు గుణక్షోభరూప ప్రాకృతికసర్గంబును మహదాది వైకృతికసృష్టియు విరాట్పురుషాధార బ్రహ్మాండసంభూతియు స్థూలసూక్ష్మకాలగతియుఁ బద్మసముద్భవంబు, వరాహావతారము హిరణ్యాక్షవధము నూర్ధ్వతిర్య గవాక్సర్గంబును రుద్రసృష్టియు శతరూపా స్వాయంభువ మను జననంబును గపిలావతారంబును గపిలదేవహూతి సంవాదంబును నాదిగాఁగలది తృతీయస్కంధము.

కం తొమ్మండ్రు ప్రజాపతు లుద, యమ్మగుటయు దక్షుచేయు ♦ యజ్ఞమ్ము వినా
శమ్మగుటయు ధ్రువునిచరి, త్రమ్మును బృథుచక్రవర్తి ♦ రమ్యచరితముల్. 10

వ. నారదప్రాచీనబర్హిస్సంవాదమ్మును మున్నగునవి కలది చతుర్థస్కంధము 11

కం. అనులము ప్రియవ్రతచరి,తము నాభిచరిత్ర బుషభ ♦ తనయ భరత వృ
త్తము ద్వీప వర్ష భూధర, సముద్ర కూలంకషోవ ♦ చయ వర్ణనముల్. 12

వ. జ్యోతిశ్చక్రసంస్థితియుఁ బాతాళ నరకభేద వర్ణనములుగలవి పంచమ స్కంధము. 13

తే. దక్షజన్మంబు నతనినం ♦ దనల కమర,
దైత్య తిర్య గ్భుజంగ ప ♦ తత్త్రిముఖులు
వొడముటయుఁ ద్వాష్ట్రిపుట్టువుం ♦ బొడవడఁగుట
లలరునదియ షష్ఠస్కంధ ♦ మనఁగఁబడును. 14

కం. నిక్కపుహరిదాసుల మున్, లెక్కింపంబడగిన భక్తి ♦ లీనుఁడు జగమం
దొక్కఁడ ప్రహ్లాదుఁ డతని, మక్కువకత గలద సప్త ♦ మస్కంధమునన్ 15

తే అష్టమంబునఁగలవు మ ♦ న్వంతరాను
చరితములును గజేంద్రమో ♦ క్షణము వార్ధి
మథన దేవరాక్షసయుద్ధ ♦ మత్స్యకూర్మ
వామనాద్యవతారాభి ♦ వర్ణనములు. 16

సీ. రాజవంశానుకీ ♦ ర్తనము నిక్ష్వాకువం
శ్యుండయిపొల్చు సు ♦ ద్యుమ్నుచరిత
మును, నిలోపాఖ్యాన ♦ మును సూర్యవంశాను
చరిత శర్యాతిరా ♦ జర్షి దుహిత
యగు సుకన్యాగాథ ♦ యంబరీషుచరిత్ర
మిక్ష్వాకుజన్మంబు ♦ నింద్రవాహు
వృత్తము మాంధాతృ ♦ వృత్తాంతమును సౌభ
రితపోబలము త్రిశం ♦ కు తనయకథ.

తే. సగరుకతయు భాగీరథీ ♦ సంభవంబు
విమలుఁడైన ఖట్వాంగభూ ♦ విభుని నడత
సర్వపాపావనోదన ♦ క్షమము రామ
భద్రు దివ్యచారిత్రాభి ♦ వర్ణనమ్ము 17

కం. నిమివిభు సంగపరిత్యాగము జనకోద్భవము తార ♦ గావించిన కా
ర్యమును బురూరవు ననురాగము భార్గవరాముచేయు ♦ క్షత్త్రక్షయమున్.

తే. అవల నహుష యయాతి దుష్యంత భరత
రంతిదేవ శంతను భీష్మ ♦ రమ్యకథలు
యదుకులానుకీర్తన మాది ♦ యౌ విషయము
లలరెడిని నవమస్కంధ ♦ మందు మివుల. 19

తే. కృష్ణదేవుండు వసుదేవు ♦ నింటఁబుట్టి
నందుకడఁ బెరుఁగుట పూత ♦ నా వధంబు
శకటుత్రోపుఁ దృణావర్త ♦ చాలనంబు
వత్స బక మారణం బఘో ♦ ద్వాసనంబు. 20

సీ. బ్రహ్మ మాయాప్రభా ♦ వముగంట బలుఁడు ధే
నుకు మన్నిగొనుట కృ ♦ ష్ణుండు కాళి
యాహి గర్వోద్ధతి ♦ నడఁచుట గోగోప
కుల నెరగలినుండి ♦ తలఁగుటయును
బలుఁడు ప్రలంబుని ♦ బిలుకుమార్చుట నందు
రక్షయు గోపికా ♦ వ్రతము మాని
పత్నులభక్తి వి ♦ ప్ర జనానుతాపంబు
భూరి గోవర్ధనో ♦ ద్ధారణంబు

తే. శక్రకృతము యజ్ఞాభిషే ♦ చనము గోపి
కాంగనాక్రీడ శంఖచూ ♦ డానుమారణ

వృషభ తురగ ఖరాసుర ♦ విదళనములు
విమలుఁ డగ్రాహాసురాళి గో ♦ పికల వగపు.  21

కం బలరామకృష్ణులు మహో
త్సులు మధురకుఁజనుట హస్తి ♦ ముష్టిక చాణూ
రుల కంసాదులవధ మొ
జ్జల మృతసుతుఁ దెచ్చి సంత ♦ సము గూర్చుటయున్.  22

వ మధురవసించుచు బలకృష్ణులు యాదవప్రియకార్యము లాచరించుటయుఁ గృష్ణాదేశంబున నుద్ధవుఁడు గోపికలచెంత కరుగుటయుఁ బలుమారులు జరాసంధ సైన్యము రామకృష్ణులు వధించుటయు యవనేంద్ర ఘాతనంబును గుశస్థలీవివేశనము రుక్మిణీహరణము పారిజాతానయనము హర విజృంభణము బాణభుజకృంతనము నరకాసుర సంహారణము షోడశ సహస్రాంగనావరణము చైద్య పౌండ్రక సాల్వ దంతవక్త్ర శంబర ద్వివిద ముర పంచజనాదిమారణము వారాణసీదహనము పాండవుల నిమిత్తము చేసికొని కృష్ణుఁడు భూభారమడంచుటయు మున్నగు కథలు దశమస్కంధమునఁ గలవు.  23

కం. పాఱులు ప్రేల శపించుట
నారద వసుదేవభాష ♦ ణము కృష్ణుఁడు తన్
గోరఁగ సర్వోపనిష
త్సార మ్ముద్ధవునితోఁ బ్ర ♦ సంగించుటయున్.  24

కం. యాదవనాశము బల దా, మోదరు లాత్మీయ యోగ ♦ యుక్తిఁ జనుట లో, నౌ దివ్యకథలుగల వే, కాదశమగు స్కంధమందు ♦ ఘనగుణులారా !

కం. యుగలక్షణ వృత్తులు కలి
యుగనర కష్టములు నాలు ♦ గోజల లయముల్
తిగతెగల పుట్టువులు ది
వ్యగతికిఁ బతి విష్ణురాతుఁ ♦ డరుగుట మఱియున్.  26

కం. శ్రుతిశాఖా విభజనమున్ యతిమార్కండచరితము మ ♦ హాపురుషాంగ
స్తుతి సూర్యవ్యూహాదులు, చతురత నుడివితిని ద్వాద ♦ శస్కంధమునన్  27

కం. మీరడిగిన ప్రశ్నమ్ముల, కారసి యుత్తరములిడితి ♦ నబ్జాక్షుని లీ
లారూప కర్మముల నొ, ప్పారఁగఁ గీర్తించితిని మ ♦ హామునులారా !  28

## ఫ ల ము

కం. ధరజాతియుఁబడియుఁ గ్రొత్తై, మఱచియుఁదుమ్మియును వ్యాధి ♦ మణఁగియు నార్తిం
బొరలియు నెట్లైనఁ బెద్దఁగ, "హరయేనమ" యన్న జాలు ♦ నడఁగు నఘంబుల్.

ఉ. కాంచనచేల! శత్రుజన ♦ కాల! దయాగుణలోల! భక్తర
క్షాంచితశీల! యోగిహృద ♦ యాటనశీల! యటంచు భక్తిఁగీ
ర్తించిన విన్న, వారలమ ♦ ఙ్క హరిసేరి తలంగు దుఃఖముల్
మంచుల వేఁడివెల్గువలె ♦ మబ్బులఁ బెన్నుడిగాడుపుంబలెన్. 30

తే. అచ్యుతుఁడు భగవానుం డ ♦ ధోక్షజుం డ
కీర్తితములౌ కథల్ మృషా ♦ గిరము లల్ప
ములు నసత్యముల్; కీర్తితం ♦ బులు బళీ! శు
భాకరములు పుణ్యదముల్ య ♦ థార్థములును. 31

కం. ఎది యుత్తమకీర్తి గుణా, భ్యుదయము గానంబుసేయు ♦ నో! యదె రమ్యం
బదె రుచికర మదె యానం, దద మదె శోకాబ్ధిశోష ♦ ణము మర్త్యులకున్.

ఉ. ఎమ్మెయిఁ జిత్రశబ్దముల ♦ నేర్చిన నే? మది విశ్వపావన
త్వమ్మునఁ గ్రాలు నచ్యుతు ను ♦ దార యశంబును దృప్తిదీఱ గా
నమ్మును జేయదేఁ గరట ♦ నాయకతీర్థమ యద్ది హంససే
వ్యమ్మదిగాదుసూ! పరమ ♦ హంసతతుల్ జలజాక్షసేవకుల్ 33

మ. ప్రతిపద్యంబున వానినామ మలరా ♦ రంగాఁబనే? మీఁకు శా
శ్వత కీర్త్యంకితమైనగాథ యగునేఁ ♦ జాలట్టిదానిన్ సమా
దృతి విన్న న్వినిపించినన్ మఱియుఁ దా ♦ నే పాడుకొన్నం బురా
కృత ఘోరాఘపరంపరల్ క్షణములో ♦ క్షీణించెడిన్ శౌనకా! 34

కం. పురునైష్కర్మ్యంబయ్యును, హరికీర్తి విరహితమైన ♦ నలరదు కంటే!
మఱి యుత్తమకర్మము నీ, శ్వరార్పితము గాదయేని ♦ వరలునటయ్యా! 35

కం అమలచరిత! శౌనక! యుత్తమకర్మముగూడఁ జేయ ♦ తఱినే ఫలకా
లమునందే సురుతర కష్టములం గలిగించుఁజువ్వె ♦ జనములకెప్పుడున్. 36

మ. తమవర్ణాశ్రమ ధర్మనిష్ఠలు తపో ♦ దానశ్రుతాదుల్ యశో
ర్థములం గోరియ సల్పుచో నవి సిర ♦ ర్థంబుల్ సుమీ వానఁ గ
ష్టమొండున్ మఱివానికిం జతగఁ గృ ♦ ష్ణస్వామి పాదారవిం
ద మహాసంస్మృతి కల్గినం బెసిడిమే ♦ నం దావియున్నట్టులే. 37

చం. హరిగుణకీర్తన శ్రవణ ♦ సాదరముఖ్యములం దదంఘ్రి సం
స్మరణములన్ విరక్తియును ♦ జ్ఞానము సత్త్వవిశుద్ధి శాంతియున్

నిరుపమభక్తి చేకొని, య ♦ నేకవిధాఘము లాఱిపోవ న
స్పురుషు సమస్తభద్రములు ♦ పొందును వేయునికేల శౌనకా! 38

ఉ. ఓయవనీసురుల్! తమర ♦ నుత్తమభక్తి సతం బనన్యభా
వాయతి దేవదేవు నఖి ♦ లాత్ము ననేవు ననంతు నీశు నా
రాయణు నాత్మరూపు హృద ♦ యంబుననిల్పి భజించియుంటిరా
రా! యిది యెంతదొడ్డభిష ♦ యంబు! కృతార్థులరైతి రెంతయుఁ. 39

తే. మున్ను ప్రాయోపవిష్టుఁడై ♦ యున్న యాత్త
రేయుఁడును మునీంద్రులము సం ♦ ప్రీతివినఁగఁ
దపసిమిన్న చెప్పిన యాత్మ ♦ తత్త్వ మడిగి
దానిఁదలపించితిరి నేఁ గృ ♦ తార్థతముఁడ! 40

కం. పొగడఁదగిన లీలలుగల
నగధరు మాహాత్మ్య మశుభ ♦ నాశక ముప్పొం
గఁగ నెమ్మది లింతవఱకు
జగతీసురులార! మీకుఁ ♦ జాటితిఁజుండీ. 41

తే. నానుడివియున్న యీపురా ♦ ణమ్ము ననుది
నమ్ము నెవ్వఁ డనన్యమా ♦ ననముతోడ
జామయిన క్షణమైనను ♦ శ్రద్ధగలిగి
వినునొ? వినిపించునో తాఁ ప ♦ విత్రుఁడగును. 42

కం. ఈదీని ద్వాదశినో? యే, కాదశినో విన్నఁగలుగఁ ♦ గడునాయువుగా
రాదుండు గాక చదివిన, చో దీక్షగ నఘములడఁగి ♦ శుద్ధతముఁడగుఁ. 43

తే. ఉపవసించి యీసంహిత ♦ నుదితభక్తి
మధురయందు ద్వారకయందు ♦ మఱియుఁబుష్క
రమ్మునందుఁ బఠించెడు ♦ నమ్మనుష్యుఁ
డెపుడు సంసారభయము న ♦ హింపఁబోఁడు 44

కం. దీనిఁజదివించి వినియెడి, మానవులకు దేవతాని ♦ మను సిద్ధ పితృ
త్పాత్మనాథు లభీష్టంబులు, మానుగఁ గురియుదు రనేక ♦ మార్గములదయుఁ.

తే. అవనిసురుఁ డెల్లశ్రుతుల న ♦ ధ్యయనమాచ
రించి పొందుఫలమ్ము గో ♦ ఘృతము పాలు
తేనె వెల్లువల్గట్ట న ♦ రితతి కన్న
మిడినఫలము దీనిఁబఠింపఁ ♦ బడయు నరుఁడు. 46

కం. ఏవిధిఁ బఠించినం బ్రా, దేవుఁడు ప్రజ్ఞఁగని వరమ ♦ ధృవపద మొందున్
భూవరుఁడు చదివినం బా, రావారపరీతముం ధ ♦ రం బాలించున్. 47

ఆ. వైశ్యవరుఁడు దీనఁ ♦ బఠియింపఁ గోటికిఁ
బడగ నెత్తఁగలఁడు ♦ ప్రాజ్ఞులార!
శూద్రవరుఁడు దీని ♦ శోధింప సర్వపా
పముఁ బాసి శుద్ధిఁ ♦ బడయఁగలఁడు. 48

చం. కలిమల సంహతిక్షపణ ♦ కారణుఁ డచ్యుతుఁ డన్యసంహితా
వలులఁ గథాంతరంబులనె ♦ పాడఁబడుం జుమి యాడనాడ; న
ట్టు లిచటఁ గాద దీననెపు ♦ డుం బ్రతిగాథఁ బ్రతిప్రసంగముం
దొలుకు నశేషమూర్తి మహి ♦ మోజ్జ్వలకీర్తి యనేకభంగులన్. 49

ఉ. ఆయజు నాత్మతత్త్వుని న ♦ సంతుని నచ్యుతు నైజశక్తిచే
నీయఖిలంబు లీల సృజి ♦ యించుచుఁ బెంచుచు సంయమించుచున్
బాయక యుండువాని శివ ♦ వజ్రి విరించిన ముఖ్యదేవ దు
ర్జ్ఞేయచరిత్రు నీశ్వరుని ♦ జేతులు మోడ్చి నమస్కరించెదన్. 50

ఉత్సాహము॥ ఊరిపోవుచున్న ప్రకృతి ♦ యుం బురుషుఁడు మహదహం
కారములును శబ్దపంచ ♦ కమ్మును నవశక్తులే
పార స్వాత్మయంద స్థిరచ ♦ రాళిఁ జేసి వానిలోఁ
దారెడు నుపలబ్ధిమాత్ర ♦ ధాము దేవు ప్రొక్కెదన్. 51

చం. అనిశము నాత్మసౌఖ్య నిభృ ♦ తానుభవంబునఁ గుల్కు చన్యభా
వనలఁ బరిత్యజించి ముర ♦ భంజను దివ్యమనోజ్ఞలీల లా
త్మను గరఁగింపఁ జేసెఁ బెరి ♦ మన్ సుపురాణముఁ దత్త్వదీపము
య్యనఘు శుకర్షిచంద్రముని ♦ వ్యాసతనూజు నమస్కరించెదన్. 52

వ. అని సూతుండు నిమీలితాక్షుండయ్యె. 53

ఇది ద్వాదశాధ్యాయము
సమాప్తము.

## త్రయోదశాధ్యాయము

కం. శ్రీమత్కారుణ్య కటా, క్షామృత వర్షాభివర్ధి ♦ తాంతర్దృష్టి
స్తోమ హృదయ పరమానం, దామల సస్యప్రరోహా! ♦ హరిహరనాథా! 1

వ.[1] దేవా! అవధరింపుము. అంత శ్రీసూతుండు నిమీలితాక్షుండై చేతులు
మోడ్చి 2

మ. ఎవనిన్ స్తోత్రమొనర్తురో వరుణ రు ♦ ద్రేంద్రాజముఖ్యుల్ సదా
ఎవనిన్ బాడుచునుందురో ? సామగులు సాం ♦ గేద్ధశ్రుతిశ్రేణిచే
ఎవనిన్ ధ్యానగతాంతరంగులయి యో ♦ గీశుల్ గనుంగొందురో
ఎవనిం గాలదిశాదులంటుకొన వా ♦ యీశుం బరున్ మ్రొక్కెదన్. 3

మ. కలశోదంచనముల్ సరోప్రహశములుం ♦ గాలూనగాజాల క
వ్వల నొక్కబ్ధియుబట్ట కేశుజలధుల్ ♦ వ్యాపించి దైనందిన
ప్రలయుంబం దఖిలౌషధీకలిత నా ♦ వం దాల్చి వేబోకగా
నలువం జేర్చిన మీనుమీనము ముదే ♦ నస్సంహాతిం గూల్చుతన్. 4

చం. తరిమల గద్గిరం దిరుగ ♦ దద్దృషదగ్రనిఘృష్టి బృష్ఠపుం
దురద యడంగి కూర్కనెడ ♦ దోచినవేన గలంగి మున్ సరి
ద్వరు డిపుడుం దదీయమగు ♦ వాసన శ్రాంతిమెఱుంగ కెప్పుడుం
దిరుగుచువట్టు నాకమర ♦ దేవునియూర్పులు మమ్ముగ్రోచుతన్. 5

చం. ఘురఘుర ఘుర్ఘురించునెఱ ♦ ఘోణబిలంబుననుండి వడ్డ శీ
కరమొకడ డీచతుర్దశ జ ♦ గంబులముంప వడంకుచున్న భూ
తరుణిని ముస్తకంబునటు ♦ తాల్చిన యజ్ఞవరాహ దంష్ట్రికా
గ్ర రుచిరకోణ మస్మదఘ ♦ కాండము ఛిన్నమొనర్చ గావుతన్. 6

చం. కలువులపొత్తిపెన్నెఱులు ♦ గంకతమై పొలదిండిపిండుగుం
డెలకడికండలందఱుగ ♦ నిష్ఠురమాకరపత్రమై శ్రితా
వళిపెనుమూడ్పుపై దివిజ ♦ పాదపభూస్రజమై తనర్చు నృ
జ్వలనరసింహుహస్తనఖ ♦ జాలము మాకొలప్రక్షాలించుతన్. 7

చం. ఇన శశి భూ దిగంబర యు ♦ గేత దధస్థ్స జగంబు లేదు నొం
ట, నొకట నూర్ధ్వసప్తభువ ♦ నంబులు లోచినదేది ? దేనిభ
క్తిని గడుగ స్వీకరించి యల ♦ తీర్థము మజ్జగముం బవిత్రముం
బొనరుచుచుండె నవ్వటుగు ♦ ప్రోడ పదాబ్జము మమ్ము నేలుతన్. 8

చం. అలకృతవీర్యసంభవ స ♦ హస్రభుజాగ్ర కదుష్ణ రక్తధా
రలు బదనెక్క దుర్జయ ధ ♦ రావుల శీర్షము లిర్వదొక్కమా

1. 14-2-1947 అధ్యాయ ప్రారంభము

ర్లిలఁబడఁ ద్రుంచి తండ్రిఋణ ♦ మీఁగి ప్రశాంతతఁగన్న భార్గవో
జ్జ్వలిత పరశ్వధప్రథలు ♦ పాచుత మద్వృజినాంధకారముల్. 9

మ. అపరాధింగని చంపఁగాదివురుఁ, ద్రా ♦ సావేశునింగాంచి తి
చ్చపడుం బొలెడివానిఁగాంచి విచికి ♦ త్సాలోలమాఁ, గావుకా
వృపతీ ! నీ శరణంబు సొచ్చితినటం ♦ బోషించుఁబో చేతన
త్వపరీతుంబలె కట్టిరాము శరరో ♦ పంబేలు నేకాకినిన్. 10

చం. జననికి విశ్వదర్శనము ♦ సంగెను ప్రేతలమానముల్ గలం
చెను శిశుపాలముఖ్యుల గ్ర ♦ సించెను బార్థుని సంశయంబు మా
న్చెను ధరణీభరం బుడిపె ♦ శిష్టపథంబును నిల్పె బోధముం
బెసఁచె యశోదనందనుని ♦ పిన్నని నవ్వులచూపు నన్నదన్. 11

మ. ఒకకాలంబుననే యనేకవిధ రూ ♦ పోపేతుఁడై యుండుఁ గొం
డికతానంబుననే జగచ్చయముఁగ ♦ న్పింపం బ్రదర్శించు నొ
క్కొకగేహంబున నేకదిష్టముననే ♦ యుండున్ యశోదా కుమా
రకుఁడో! మాయలమారివాఁడొ? సగుణ ♦ బ్రహ్మమ్మొ కీర్తించెదన్. 12

షోడశదళపద్మబంధము

25 9 1
సీ. * హా స్తియూథే శ రక్షాంచితా మిత కృపా
10 26 11
శ ర్మ దేవాశౌ రి ఖలగ ణా రి
2 12 27
మేఘుస న్ని భ దేహాబి శ్రీ కృ తేంకీ హా
13 3
గరుడమ హితపత్ర కం జనేత్ర
14 28 15
స ద్గు ణనిక ర విశద రు చిభూషాఘు
4 16 29
టి తహృదయా భా వటిష్ఠ నా గ
17 5 18
పతి గ ర్వహరణ గు రుతనూభ వ ప్రాణ
30 19 6
సం ధా నచరి త విశ్వభర రు చిర
20 31 21
భోగి మి త్రవర్య జిష్ణు కాయాగ దం ష్ట్రి
7 22 32
హారినా నా మునివశ ర ణ్యాశ్రుతి తం త్ర

* 1 మొదలు 32 వఱకు వరుసగా సంకెల క్రింది యక్షరములఁ జదివికొనవలెను.

23 8 24
పరచిదాత్మవిరాథ తిమిరపతంగ
మనువు మయు మఖమయు మము మహిమమమర. 13

—* అష్టాదశపురాణగ్రంథ సంఖ్య *—

వ. అని నమస్కరించి సూతుండిట్లనియె. శౌనకాదిమహర్షులారా! పదునెన్మిది పురాణముల గ్రంథసంఖ్యను దత్సమాహాత్మ్యంబును నాలింపుఁడు. 14

సీ. వేలసంఖ్యలలోన ♦ వినుఁడు బ్రాహ్మముపది
పాద్మమేఁబదియైదు ♦ వైష్ణవంబు
సంఖ్య యిర్వదిమూఁడు ♦ శైవమిర్వదినాల్గు
బ్రహ్మకైవర్తంబు ♦ పదునెనిమిది
వారాహమది యిరు ♦ వదినాల్గు కౌర్మంబు
పదునేడు మాత్స్యంబు ♦ పదియునాల్గు
నారదం బిరువది ♦ నాల్గుపైనొకటి బ్ర
హ్మాండంబునందుఁ బం ♦ డ్రెండునుండు

తే. గారుడమునఁ బందొమ్మిది ♦ గ్రాలుఁ బదియు
వామనమున, లైంగంబునఁ ♦ బదునొకండు
భాగవతపురాణంబునఁ ♦ బదునెనిమిది
వేలు గ్రంథసంఖ్య వెలుంగు ♦ విప్రులార! 15

వ. మఱియు స్కాందమున నెనుబదియొక్క వేయినూఱును, మార్కండేయంబునఁ దొమ్మిదివేలు, నాగ్నేయంబునఁ బదునైదువేలనాలుగునూఱులు, భవిష్యత్తున బదునాలుగువేలయైదునూఱులు గ్రంథసంఖ్య యుండును. ఈ పదునెన్మిది పురాణంబులమొత్తము గ్రంథసంఖ్య నాలుగులక్షల పరిమితమైనది ఇఁక శ్రీమద్భాగవతవిషయమును దత్ప్రయోజన దాన పఠనాది మాహాత్మ్యములను జెప్పెదవినుఁడు. 16

—* భాగవత విషయ ప్రయోజనములు *—

కం. ఏతద్భాగవతము భవ, భీతుండై స్వీయనాభి ♦ విమలకమల పీ
ఠీతల్పంబున నొడిఁగిన, ధాతకు బోధించెఁ గరుణ ♦ దలఁకొన హరియున్. 17

తే. ఆదిమధ్యావసానంబు ♦ లందు దీన, నలరు వైరాగ్యబోధకా ♦ ఖ్యానకమ్ము
లెల్లెడలఁ జిప్పిలుచుండు ♦ నిందిరేశు విమలలీలాకథా సుధా ♦ విభ్రమములు.

తే. తత్పదార్థమైయొప్పు శు ♦ ద్ధమగు బ్రహ్మ
మరయ "త్వం" పదార్థమగు శు ♦ ద్ధాత్మ మొకఁడ

సుమి సమస్తవేదాంతసా ♦ రమిది యంచు
నద్వితీయ వస్తువుఁ జాటు ♦ నయ్యుయిదియు. 19

ఆ. భవ్యభక్తి దీనఁ ♦ బ్రతిపాద్యమైనట్టి, విషయమిదియె సుండి ♦ విప్రులార !
కలుగుదీనివలనఁ ♦ గైవల్య మదియె ప్రవ, యోజన మ్మిఁకేల ♦ యోజనమ్ము. 20

## ✦ గ్రంథమహిమము ✦

తే. భాద్రపదమాస పూర్ణిమ ♦ భర్మసింహ
పీఠి శ్రీభాగవతమును ♦ వెలయనిలిపి
భక్తిఁబూజించి యొక్క స ♦ ద్బ్రాహ్మణునకు
దానమిచ్చిన నుత్తమ ♦ స్థాన మొదవు. 21

ఆ. భాగవతము కంటెఁ ♦ బదునెంతవలికె స, త్పురుష గోష్ఠులందుఁ ♦ బొదలుచుండు
నితరమగు పురాణ ♦ వితతి సూర్యుని రాక, దాఁకగాదె నూంబ ♦ మూకవీక.

ఆ. జీవనిపదసార ♦ మైన భాగవత సు, ధారసంబు కంత ♦ దప్పుమునను
ద్రావినట్టివాఁడి ♦ తరములు నాసింపఁ, గడఁగునట్టె యెట్టి ♦ ఘస్మరుఁడును. 23

ఆ. ఆపగాసమూహ ♦ మందు భాగీరథి, దేవులందు వాసు ♦ దేవమూర్తి
వైష్ణవులను శివుఁడు ♦ వాసికెక్కినయట్టు, లితరములను భాగ ♦ వతముమిన్న 24

ఆ. [1] పుడమి బొలుచు క్షేత్ర ♦ ములలోన శ్రీవార
ణాశి మిన్నయైన ♦ యట్టు లఖిల
మహా పురాణజాల ♦ మందు శ్రీభాగవ
తంబు మిన్న సంది ♦ యంబు లేదు. 25

శా. ప్రేమస్థానము భక్తకోటికిఁ దప ♦ స్విశ్రేణి కత్యుత్తమ
క్షేమప్రాపక దైవ మెల్లరకు ను ♦ శ్రీ జ్ఞాన వైరాగ్య ని
ష్కామాంచద్విధి భక్తి దుగ్ధము లొసం ♦ గంజాలు స్వర్ధేను వీ
శ్రీమద్భాగవతంబు విన్నఁ జదువన్ ♦ శ్రేయంబు లేపారవే? 26

మ. భువిలో వైష్ణవపాళిమూలధన మీ ♦ పున్నెంపుఁబొత్తంబు శ
స్త్రవిధిం బారమహంస్యమైన విమల ♦ జ్ఞానంబుఁ గీర్తించు జ్ఞా
న విరాగ స్థిరభక్తి సమ్మిళితమా ♦ నైష్కర్మ్యముం దెల్పు దీ
ని విచారించి పఠించిన న్వినిన వా ♦ ని న్ముక్తి పెండ్లాడెడిన్. 27

మ. మును కల్పాదిని దాని ధాతకు స్వయం ♦ భూరూపియై నారదా
ఖ్యునకున్ నారదుఁడొంచు వ్యాసునకు వ్యా ♦ సోదారరూపంబుతో

(1) దీనికి శ్లోకము వావిళ్ళప్రతిలో లేదు. బొంబై ప్రతిలోఁ గలదు.

ననఘుండౌ శుకయోగి కాశుకతనూ ♦ వ్యాప్తిన్ బరీక్షిన్నరేం
ద్రున కిజ్ఞానసుదీప మిచ్చు పరుస ♦ త్యుం గొల్చెదన్ ధీమహిన్. 28

కం. అమృతునకు విశోకునకున్, విమలునకున్ దత్పదార్థ ♦ విజ్ఞేయునకున్
సుమనోవరేణ్యునకు దే, వముఖ్యునకుఁ గేలుమోడ్చి ♦ ప్రణతులొనర్తున్.

ఆ. మును ముముక్షుడైన ♦ వనజసూతికి సత్కృ, పారసమున భాగ ♦ వతము ద్రాపె
వాని వాసుదేవు ♦ భగవంతు సాక్షి భ, జింతు మ్రొక్కలిడుదు ♦ శిరము వంచి.

కం. సంసారోగ్ర భుజంగమ, హింసా పరితప్తునిం బ ♦ రీక్షితు విద్వ
త్సంసత్తుఁ గాచిన ముని వ, తంసు శుకుని బ్రహ్మరూపు ♦ దలఁతోఁ దెలతున్.

కం. ప్రతిభవమున నీపాద, ద్వితయమునపై గాఢభక్తి ♦ దీటుకొనుచునుం
డు తెఱంగు సేయఁగదె నా, పతివగుట న్నీవు దేవ! ♦ వరయోగీశా! 32

ఆ. ఏమహానుభావు ♦ నామకీర్తనమున, సర్వపాపములును ♦ సమసిపోవు
నట్టి దేవదేవు ♦ నచ్యుతు నభవునిఁ, దెలతుఁ గేలు నుదుట ♦ నిలిపి భక్తి. 33

వ. అని శ్రీసూతపౌరాణికాగ్రగణ్యుండు పరమపుణ్యంబైన నైమిశారణ్యంబున
శౌనకాదిమహర్షివరేణ్యులకు శ్రీమద్భాగవతమ్ము మహాపురాణమ్ము నష్టా
దశసహస్రసంఖ్యాకమ్ము మనోహరమ్ము పారమహంస్యమ్ము శ్రీవైయాసికమ్ము
బ్రహ్మవిద్యారహస్యమ్ము బోధించి వారిచే సముచితసత్క్రియలనంది
పరమానందంబునొంది యెందేఁజనియె 34

కం. పదివత్సరములనుండియు, నుదినము గాయత్రిఁ బేర్కొ ♦ నుటనో వేమా
ర్లిదినా కనుగ్రహించె, స్సదయహృదయ వేదమాత ♦ నాతల్లిగదే! 35

కం. కొండొకనిఁ బట్టుకొని యిటు కొండంత దలమోపి దింపి ♦ గొండ్లీసలువు దీ
కొండాటము క్రొత్తయె? బ్రహ్మాండంబులనాడు నీకు ♦ హరిహరనాథా! 36

కం. భావార్థదీపికయె తో, డై వచ్చెను జ్ఞానిక యుస ♦ హాయ యటనటం
గై పట్టి బుద్ధి త్రిప్పిన, యావరశక్తి యెవరయ్య ♦ హరిహరనాథా! 37

కం. ఒకశక్తి నాదు కేల్వ, ట్టుకొని రచింపించుచుండె ♦ డు నటంచును న
మ్మకము కుదిర మఱియున్నిం, టికినింతె యటన్నతలఁపు ♦ నిలువదుస్వామీ!

కం. ఏదియొ నన్ ప్రేరేచుట, చే దీని రచించినాఁడఁ ♦ జే వా దోసఁగుల్
గాదని సవరింపుఁడు నా, చేదోయి మొగుడ్తు విబుధ ♦ శేఖరులారా! 39

కం. మాయామయమ్ముగట నీ, కాయ మహంభావ మొదవు ♦ కాలమ్మున నే
వ్రాయు నెడ దోసంగులు పడె, నా? యేమి? క్షమింపుమయ్య ♦ హరిహరనాథా!

కం. ఏ నెఱిఁగినదొక్కండ, ద్దాని రచించు నెడ నొకఁడు ♦ దానినొరుఁడు గ
న్గొ నొకఁడై శ్లోకం చె, ప్పైనదా? భారమ్ము నీదె ♦ హరిహరనాథా! 41

కం. ఎంత తెలివి యొసఁగితివో, యంతఁగ వ్రాసి వినిచితిఁ బ్ర ♦ హర్షముఁ గంటే
యెంతటి పిండికి రొట్టెయు,నంతటిదే గాదటయ్య ♦ హరిహరనాథా! 42

కం. కరి ఋతు సామజ తారే,శ్వర సంఖ్యలఁ బొలుచు శాలి ♦ వాహనశకవ
త్సరమున రచించి యీకృతి, నరుసముతో నీకొసఁగితి ♦ హరిహరనాథా! 43

కం. మంగళము మాసతీ హృద
యంగమునకు మంగళము ని ♦ రంతరకరుణా
పాంగునకు మంగళము వి
శ్వాంగునకు న్మంగళమ్ము ♦ హరిహరపతికిన్. 44

కం. వక్త్రగళస్మయహరణ! వి
రక్త్రజటీట్భరణ! దేవ ♦ రాడ్బాహు పరి
వ్యక్త్రవ్యచరణ! చిదభి
వ్యక్త్ర్యశుభిపుంజకరణ! ♦ హరిహరనాథా! 45

శా. శ్రుత్యంతప్రతిపాద్యరూపవిభవా ♦ రూఢా! ప్రకృత్యాకృతి
ప్రత్యాఖ్యానరతర్షినిర్మలమనో ♦ భావావలీఢా! ధరా
పత్యస్మేరకటాక్షమాల్యరుచిరా ♦ బద్ధోత్తమాంగా! కవీ
ట్సుత్యాపాంగ! లసద్ఘృణా! బుధజనా ♦ స్తుంకారలోకంపృణా! 46

వసంతతిలకము॥ శ్రీసంధ్యవేష! తుల ♦ సీ ఫణిదామభూషా!
దీనార్తిశోష! యవ ♦ ధీరితకామరోషా!
మానీంద్రపోష! మతి ♦ మద్గమనీయభాషా!
జ్ఞానాభిలాష దివి ♦ షద్వరచిత్తతోషా! 47

గద్యము
ఇది
శ్రీభగవ
దనుగ్రహాలబ్ధకవితాచరిత్ర
శ్రీవత్సగోత్రపవిత్ర మిన్నికంటివంశాం
బుధితారాకళత్ర పేరనామాత్యపౌత్ర సుబ్బమాంబా
లక్ష్మణమంత్రిపుత్ర ఉభయభాషాప్రవీణ వేదాంతపారీణ
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీమద్గురుభాగవతము
నందు ద్వాదశస్కంధము
సమాప్తము
శ్రీ
శ్రీ హరిహరనాథార్పణమస్తు

Orient Press, Tenali

# తప్పొప్పుల పట్టిక

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 15 | దర్థ | దార్థ |
| | 27 | తీవి | దీప్తి |
| 4 | 17 | షం | రం |
| | 19 | షం | షు |
| 7 | 10 | వారిచి | వాలిచి |
| | 33 | పానము | పాన |
| 8 | 20 | — | సారథీ |
| 9 | 3 | వాఘ్రూ | వ్యాఘ్రూ |
| 11 | 3 | మేము సాయ | మేములోటు |
| | 25 | యజ | యజు |
| | 26 | సేవార్ద | సేవార్ద్రి |
| 12 | 6 | వీసముంవా | వీసమువార |
| 13 | 22 | మాకండ | మాకషం |
| 15 | 5 | వ్రా.. | వ్రాని |
| 16 | 11 | మూరి | సూరి |
| 19 | 8 | — | శ్రీకమసు |
| 21 | 29 | మఖమల్ | మఖముల్ |
| 22 | 8 | వర్గమ్ముఁరాం | వర్గమ్ముగాం |
| 23 | 13 | మూచి | చూచి |
| 26 | 15 | మ్మజలార | పుత్రులరార |
| 27 | 11 | — | టునికియ |
| 28 | 19 | జెప్పుఁడయ్యె | జెప్పరయ్యె |
| 29 | 11 | ధామము | ద్ధామము |
| 30 | 29 | ౨౩ అధ్యాయ | ౨వఅధ్యాయ |
| 34 | 18 | — | నిర్వ్యాజస |
| | 24 | తితీక్ష | తితిక్ష |
| | 30 | శీత్వంబు | శీలత్వంబు |
| 38 | 11 | శుతులు | శ్రుతులు |
| 41 | 7 | సత్య | సత్వ |
| 46 | 24 | భీజ | బీజ |
| 58 | 20 | నలిపు | నలిప్తు |
| | 26 | తుగ్ని | తుగ్గిన |
| 59 | 13 | మలావ | మలాప |
| 61 | 12 | గలఁచు | గలఁచున |
| 63 | 24. | తపు | తప్తు |
| 66 | 7 | సంగము | సంగము, |
| | 15 | తేజస్వి | తేజుఁడు |
| 71 | 4 | రేని | లేని |
| 74 | 5 | ఒక్కొక్క | ఒక్కొక |
| | 18 | శక్తి | సక్తి |
| 78 | 7 | వీని | లీని |
| | 11 | నెవ్వఁడే | నెవ్వఁడేఁ |
| 79 | 30 | నామమ్ము | నామకమ్ము |
| 82 | 25 | — | మొగంబునఁ |
| 84 | 5 | — | కాలంబుచే |
| | 7 | — | పురుషులకు |
| 86 | 26 | యముల | యమ్ముల |
| 87 | 30 | సూక్ష | సూక్ష్మ |
| 88 | 29 | సూరి | సూరి |
| 97 | 31 | — | గాన |
| 102 | 1 | శ్రీకృషం | శ్రీకృష్ణం |
| 104 | 10 | — | సాకనే |
| 106 | 18 | — | సంశయమూల |
| 107 | 3 | ప్రబుద్ధ | ప్రబుద్ధ |
| | 10 | నఖిలగుణంబుల్ | నాసామ్యాదుల్ |
| 109 | 7 | యాతు | యాత్ముఁ |
| | 28 | పులకలు | పులకలు |
| 111 | 6 | శ్రేషంబు | శ్రేష్ఠంబు |
| | 21 | — | సుపర్ణు |
| 122 | 11 | దర్మము | ధర్మము |
| 127 | 19 | — | నిలిపి |
| | 29 | లటుఁగా | లటుల్ |
| 131 | 17 | కుంభి | కుంభ |
| 132 | 10 | దశక్త | దసక్త |
| 134 | 10 | ప్రధాన | ప్రధాన |
| | 11 | వీక్ష | లీక్ష |
| | 12 | పంచ | పంచ |
| | 27 | — | విరక్తుండు |
| 135 | 8 | నికిట్ల | నితోనిట్ల |
| | 19 | యెపుడుఁగా | యెపుడుఁగా |
| 137 | 28 | శక్తి | శుక్తి |
| 139 | 10 | పంద్రెడు | పంద్రెండు |
| | 29 | భూఁతా | భూతా |
| 141 | 7 | — | సంజీవన |
| 148 | 29 | — | కర్మము |
| 149 | 14 | — | ఫలమ్ము |
| 150 | 30 | — | దృష్టి |
| 151 | 19 | అద్య | ఆద్య |
| | 29 | — | వాలము |
| 156 | 8 | — | నైదు |
| | 25 | జ్ఞావన | జ్ఞాపన |
| 157 | 24 | నధిషించి | నధిష్ఠించి |
| 159 | 28 | — | షణ్ముఖ |
| | 29 | — | ప్రాప్తను |
| 160 | 20 | వల | ఫల |
| | 30 | | బీజాత్మక |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 161 | 9 | | నిషేకం |
| | 23 | | భిన్నుఁడి |
| | 25 | | విలషిణ |
| 162 | 11 | వియము | విషయము |
| 163 | 20 | భూనుర | భూసుర |
| 167 | 16 | విష్ఠ | నిష్ఠ |
| | 24 | సూత్రముఁగా | సూత్రముఁగా |
| 169 | 11 | | గ్రహావళిగాదు |
| 172 | 5 | | కాలం |
| | 14 | వరాత్మ | పరాత్మ |
| | 22 | | వష్టంభంబున |
| 173 | 11 | | ద్వైత |
| | 12 | | గ్రహించిన |
| 174 | 18 | | రాజసంబున |
| 180 | 4 | | బెను |
| 182 | 14 | అత్మో | ఆత్మో |
| 183 | 2 | | జ్ఞాన |
| | 3 | | రీరముం |
| | 25 | | గుణమయమ్మగు |
| | 26 | | గమ్మన |
| | 27 | | జొచ్చిన |
| 186 | 1 | | ప్రతాప |
| | 2 | | సురూప |
| 187 | 12 | | ప్రయోజనం |
| 188 | 30 | పువ్వారు | పువ్వారు |
| 189 | 19 | ములవ | ముఁలప |
| 190 | 6 | పొడవునూవు | పొడపుసూపు |
| 191 | 4 | నకిట్ల | నితోనిట్ల |
| 192 | 10 | సంబులొసర్వ | నంబులొసర్వ |
| | 13 | సైకతమల | సైకతముల |
| 193 | 24 | బిజము | బీజము |
| 195 | 26 | నూపా | సూపా |
| 200 | 11 | వల | పల |
| | 20 | వదిలం | పదిలం |
| 201 | 1 | నైవుణ | నైపుణ |
| | 4 | నూర్యు | సూర్య |
| 203 | 11 | | యేదిలేని |
| | 32 | | యోవర |
| 204 | 21 | వరి | పరి |
| | 24 | పంబునుంగలవ | పంబునుంగలప |
| 205 | 29 | యాతకు | యాత్మకు |
| 206 | 14 | వ్రతి | ప్రతి |
| 207 | 6 | వలితా | పలితా |
| | 7 | వరాంగ | పరాంగ |
| | 19 | వెంతలఁవు | పెరతలఁపు |
| 208 | 28 | నెట్లు | నిట్లు |
| 209 | 5 | కర | కిం |
| 210 | 3 | | మద్ధర్మోప |
| | 12 | అమృతము | అనృతము |
| 212 | 20 | గార్హార్థ్య | గార్హస్థ్య |
| 214 | 14 | | స్మరియించి |
| 215 | 30 | నూసమ్మ | సూనమ్మ |
| 216 | 14 | శావదావ | శాపదాప |
| | 18 | సూరుల | సూరుల |
| | 23 | మాహోత్సా | మహోత్సా |
| 217 | 1 | శావ | శాప |
| | 4 | | చయ్యనఁ |
| | 8 | | భాసమ్మనఁగ |
| 217 | 17 | దావ | దాప |
| | 20 | నవుడు | నపుడు |
| 218 | 17 | పటువ | పటుప |
| 219 | 3 | | నాపయినిం |
| 222 | 17 | | వాఁడటు |
| 223 | 2 | వరివీత | పరివీత |
| | 3 | కటిసూత్ర | కటిసూత్ర |
| | 16 | | మృగాస్య |
| | 21 | | చనియెడి |
| | 25 | | బొనరింపు |
| | 28 | వృధు | వృథు |
| | 29 | పావులు | పాపులు |
| | 31 | మనులు | మునులు |
| 224 | 7 | శాకమల్ | శాకమ.ల్ |
| | 20 | — | కిష్టుని |
| 225 | 1 | వతీయవ | పతీ: యప |
| 227 | 18 | తన్ను... నెంచి | నన్ను.... వచ్చి |
| 228 | 18 | స్పత్యంబె | న్పత్యంబె |
| 229 | 14 | — | నంచుఁగా |
| 230 | 8 | వలుపటి | పలుపటి |
| | 16 | వజవ | వజప |
| | 17 | — | గాదే |
| 231 | 4 | — | గన్నిటితోడ |
| | 13 | — | కొనంగ |
| | 21 | జలధర్మ | జలద |
| 232 | 2 | — | మన |
| 233 | 28 | నాలింగము | నాలింగనము |
| 235 | 14 | సలువు | సలుపు |
| | 28 | మ్రోవు | మోవు |
| 240 | 24 | 9 స్కంధమున | 9 స్కంధమున 22 అ. |
| 241 | 2 | క్షతధర్మ | క్షత్రధర్మ |

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | 33 | యఃస్సుతః | యశస్సుతః |
| 243 | 26 | పర్ధుఁడని | వర్ణుఁడని |
| 248 | 22 | యొంతయు | యెంతయు |
| 254 | 10 | వం | ప. |
| 257 | 2 | కడుప్పవ | కడుప్పనఁ |
| 270 | 30 | విఁన | విభిన |
| 272 | 14 | పరాదాం | పత్ప్వాదాం |
| 274 | 16 | — | జగాలు |
| | 27 | యుషితంబుల | నివతంబును |
| | 30 | — | జగంబు |
| 275 | 13 | — | ద్దర్శన |
| | 14 | — | హింబుస |
| 276 | 22 | — | చూచి |
| 279 | 3 | మంబునగా | మంబుగగా |
| 283 | 4 | నాలు | నాల్గు |
| 284 | 4 | శిరులకు | శిశువులకు |
| 286 | 27 | పద | పద్మ |
| 287 | 31 | పోషించిశ్శ | పోష్పించిశ్చ. |
| 290 | 1 | — | నర |
| | 13 | — | పనరు |
| 291 | 9 | మాగ్నేయంబు కౌర్మంబు బ్రహ్మాండ | మాగ్నేయ మార్కండేయ కౌర్మమ్ము |
| | 10 | మతులమార్కండేయమనెడిపేళ్లఁ | లలభవిష్యత్తు బ్రహ్మాండమనఁగఁ |
| 294 | 32 | కూర్పషుల్ | కూర్చముల్ |
| 296 | 8 | — | దినముల్ |
| 297 | 5 | — | స్రవింప |
| | 12 | వెటనే | వెంటనే |
| | 21 | నిగిడించి | నిగిడించె |
| 298 | 1 | నైస్త్రలంబులు | నైస్త్రల్యంబులు |
| | 9 | దనపులు | దనములు |
| | 11 | లఁట | లంట |
| | 13 | — | గనుఁగోసల చెప్ప |
| 300 | 5 | మేనం | మేనిం |
| | 6 | — | యనియె |
| | 12 | నిట్టులగా | నిప్పోయిగా |
| 302 | 8 | — | మింటిస్మంటిం |
| 304 | 28 | — | శాబకములు |
| 305 | 12 | కడలు | కడలుఁ |
| | 28 | తిరము | టీరము |
| 310 | 29 | సాధుంగ | సాధుసంగ |
| 311 | 31 | — | పత్రి |
| 312 | 4 | సూర్యా | సూర్యా |
| | 1 | డాల్చి | దాల్చిన |
| 313 | 13 | — | అతినిష్ఠా |
| 3,4 | 18 | — | ద్రాముల్ |
| | 28 | — | యయ్యనుభవం |
| 319 | 22 | — | ల్లసితసుముఖ |
| | 29 | — | పురుషుని |
| 324 | 9 | — | రిపువధూజన |
| 325 | 2 | దా రాజర్షికివ్యాన | వారాజర్షికివ్యాస |
| | 22 | — | ముఖులు |
| 328 | 5 | క్షాంచితశీల | క్షాంచితలీల |
| 329 | 29 | నరితతి | నర్తితతి |
| 330 | 13 | విరించిన | విరించన |
| 331 | 14 | గర్గిరం | గిర్గిరం. |
| 333 | 27 | — | వైరాగ్య |

అర్ధబిందుపులఁ జాతపుఁక వదలితి